41

ఫిబ్రవరి

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

జన్మదిన సంచిక



నిర్వహణ

'సాహితీ మిత్రులు'

1 రు.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

## జన్మదిన ప్రత్యేక సంచిక

మాసపత్రిక

**41**

ఫిబ్రవరి 1973

నిర్వహణ
'సాహితీ మిత్రులు'



96 పేజీలు | 1 రూపాయి

ముఖచిత్రం: పంచాది కృష్ణమూర్తి
సందర్భం : మృతవీరుల సంస్మరణ (41వ పేజీ చూడండి)

విడిప్రతి: ఒక రూపాయి
అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు
సంవత్సర చందా: పది రూపాయలు

సృజన వ్యవస్థాపకుల్లో, 'సాహితీ మిత్రులు'లో ఒకడు; వేమన, వేనరె, వేన రెడ్డి పేర్లతో సృజనలో కవితలు, వ్యాసాలు, పుస్తక సమీక్షలు రాసిన వే. నరసింహారెడ్డి తన 33వ ఏట అకస్మాత్తుగా 27 వ జనవరి 1973 ఉదయం 5 గంటలకు వరంగల్‌లో మరణించాడు.

—'సాహితీ మిత్రులు'

ప్రతులకు, వివరాలకు :
సృజన
హనుమకొండ
వరంగల్ - 506001

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J. P. N. Road, Warangal-506002 (A.P.)

# సృజన

1973 ఫిబ్రవరి జన్మదిన ప్రత్యేక సంచిక మాసపత్రిక 41

# వియత్నామ్ - శాంతి

11 సంవత్సరాల వియత్నామ్ యుద్ధం ముగిసింది? ఇది 11 సంవత్సరాలకే పరిమితమైన యుద్ధం కాదు. వియత్నామ్‌కే పరిమితమైందికూడా కాదు. అందుకే ఈ యుద్ధం ముగిసిందనుకోవడం మళ్ళీ ఒకసారి మోసపోవడమే అవుతుంది వియత్నామ్‌కు సంబంధించినంతవరకు ఇది దశాబ్దాలుగా ఫ్రెంచి వలసాధిపత్యానికి, అమెరికన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగుతున్న జాతీయ విముక్తి పోరాటం. 1954లో కృత్రిమంగా విడిపోయిన వియత్నామ్ ఏకీకృతమై, వియత్నామ్ ప్రజలు వియత్నామ్ ప్రజలకొరకు వియత్నామ్‌ను పరిపాలించుకునేదాకా అది పరిష్కారం కాదు. వియత్నామ్ గడ్డమీదనేకాక లావోస్, కాంబోడియా, థాయ్‌లాండ్‌లనుంచికూడ అమెరికన్ సామ్రాజ్యవాద సైన్యాలు పూర్తిగా విరమించబడేదాకా అది యుద్ధవిరమణకాదు. సైన్యాల విరమణయే యుద్ధవిరమణకు గీటురాయైతే జాన్సన్‌కాలంలో ఏభైలక్షలసైన్యం నిక్సన్ నాటికి ఇరవైవేలకు తగ్గింది. అయినా గడచిన రెండునెలలో సాగినంత ఉధృతంగా యుద్ధం గత దశాబ్దంలోనే జరుగలేదు. యుద్ధం నేలమీదనే జరగక్కర్లేదు. గాలిలోంచి, నీటిమీంచికూడా జరుగొచ్చు. అన్నిటికన్న ముఖ్యంగా ఇది సామ్రాజ్యవాదానికి, సమసమాజవాదానికి మధ్య సాగుతున్న భావయుద్ధం. ప్రపంచమంతటా సమసమాజవాదం గెలిచి, బతికిబట్టకట్టేదాకా ఈ సామ్రాజ్యవాదయుద్ధాలు స్థలం, సమయం, వ్యూహం. స్వరూపం మారుస్తాయేతప్ప స్వభావం మారదు.

వియత్నామ్‌ప్రజలు అమెరికన్ సామ్రాజ్యవాదపులి చెవులు మెలేసి వియత్నాం పోరాట సత్యాలు స్వీకరించేలాచేసారు. రాజకీయంగా, మిలిటరీవ్యూహం పరంగా వియత్నామ్ ప్రజలు ఘనవిజయం సాధించారు. దక్షిణవియత్నామ్‌లో అమెరికా కీలుబొమ్మ ప్రభుత్వం తొలగించబడి ప్రజావిప్లవ ప్రభుత్వం ఏర్పడేదాకా పోరాటం సాగుతూనే వుంటుంది. లావోస్, కాంబోడియా ప్రజలుకూడ పోరాటస్థాయిని ఆ దశకు తీసుకపోయిననాడు, థాయ్‌లాండ్‌లో తలదూర్చిన కుట్రినక్కడిప్రజలు మొగ్గలోనేతుంచేసిననాడు ఇవ్వాటి శాంతి స్థిరపడుతుంది.

అంతేకాదు మధ్యప్రాచ్య దేశాల్లో, ఆసియాఖండంలో సోషల్‌సామ్రాజ్యవాదంతో కుమ్మక్కయి అమెరికన్ సామ్రాజ్యవాదంవేస్తున్న కొత్తకొత్త వేషాలను చీల్చివేసి ప్రజలు యీ పులిపేగులు పేలికలని రుజువుపరచి యీ దిష్టిబొమ్మను యీ భూమ్మీద మిగలకుండా దగ్ధంచేసిననాడుగాని నిజమైనశాంతి.

—సంపాదకుడు

---

వార్త: పాకిస్తాన్ ప్రభుత్వం కాంబోడియాలో సిహనౌక్ (పెకింగ్‌నుంచి) ప్రవాసంలో స్థాపించిన ప్రభుత్వాన్ని గుర్తించింది.

వ్యాఖ్య: ఆసియాలో ప్రజల ప్రభుత్వాలను గుర్తించడంలో అమెరికాకో, రష్యాకో తాకట్టుపడ్డ భారత ప్రభుత్వాన్ని 'గణతంత్ర'ప్రభుత్వమని నమ్మగలమా?

# ప్రత్యేక తెలంగాణా / ఆంధ్ర లో ప్రజారాజ్యం

చెరబండరాజు

కోటకు నలువైపులానే కాదు
పీలైన అన్ని చోట్లా
డైనమెట్లు పేల్చి కూల్చనిదే
దాని గుండె మన పిడికిట్లోకి రాదు

త్రివిధ సైన్యాల పహరావుందని
హైరానా పడకండి
ఎక్కడ ఎవరిచేత్తో ఏరాయి పెకిలినా
మరమ్మత్తు మాట మరిచి
ఆ చేతిని మన సిద్ధాంత హస్తాల్లోకి తీసుకొని
రాయివెనకరాయి మరీ పెకిలించి
నేలమట్టం చెయ్యందే
అది మన స్వాధీనంకాదు

ఇన్నాళ్లూ చేసిన జాప్యం
చెప్పిన జోస్యాలు చాలు

స్పష్టంగా భూతద్దంతో నిమిత్తంలేకుండానే
కనిపిస్తున్న కోటపగుళ్లని ఇంకా పగలెయ్యండి
విరిగిపడుతున్న శిఖరాల్ని విరగనీండి

అటు
జాతి పేరు చెప్పి
శాంతి సహనాల్ని నూరిపోసి
ఉమ్మడిగా దోపిడీకి ఉచ్చులు పన్నుతున్న
పాలకవర్గాల స్వార్థశక్తుల సమైక్య గీతాలు

ఇటు
క్షణంలో ఏదో వారగబోతుందని
రొట్టెవిరిగి నేతిలో పడుతుందని
ఉవ్విళ్లూరుతూ ఉరకలువేస్తున్న
ఉభయతాప్రి పొంగుతున్న వేర్పాటు వాగులు

ఇక్కడే ఒక్కటిమాత్రం ఖచ్చితంగా
వొప్పుకు తీరాల్సిన నిఖార్సయిన నిజం
దాన్ని దాచెయ్యకండి
మేల్కొన్నవాడే ఆకాశాన్ని చూడగలడు

శాశ్వత విముక్తి పోరాటాలకు
శ్రామికవర్గంతో కలిసి
ఉభయ శత్రువును ఊడ్చెయ్యాలని
నిరుద్యోగులు విద్యార్థులూ ఉద్యోగస్తులు
మత్తు వొదుల్చుకొని మరింతగా కరుకెక్కాలి

'అడవులు'వేరైనా
తోడేళ్ళ పీక్కుతినక మానవు
ఎవరి రంగు ఏమిటో
రంగస్థలంమీదే తెలుస్తోంది

ఎవరు ఎవరివారో
ఏ మాటకు ప్రతిధ్వనులో
ఏ విలువల ప్రతినిధులో
ఉద్యమించేవారు కొంచెం
ఒక నిమిషం యోచించాలి

కష్టజీవుల్ని పువ్వుల్లో నడిపించినా
అవి
నలక్కుండా నడవండని
అక్కడా నిర్బంధాలు

కన్నీళ్ళ తుడుపుతో కష్టాలు గట్టెక్కవు
అది మాత్రం మరవకండి

మూల సమస్యల్ని తుంగలో తొక్కేందుకు
అసలు పోరాటాల బాటల్నుంచి
యువతరాన్ని మళ్ళించేందుకు
పాలకవర్గాల ఆయుధంగా ఉన్న దీన్ని
ఇంకా బతకనీకండి

అన్నం పెట్టలేని ప్రభుత్వ
నిష్ప్రత్తుల పథకాలన్నీ
దివాళాకోరు విధానాల అవధానాలే

ఇప్పటికీ విచ్ఛిత్తి జరగాల్సిందే

ఇది ప్రేరణగా దేశంలో
ఇంకెన్నో ఉద్యమాలు
ఇనుమిక్కిలి పెరగాలి
దోపిడీ కోట కూలి
నేల చదును కావాలి

మన త్యాగం మన రక్తం
మన సమస్త శక్తులు
ప్రాంతాల పంపకాలకే పరిమితం కావద్దు

ప్రజారాజ్య నిర్మాణం
ఇది పేదల నినాదం
ఇదె జీవన సిద్ధాంతం

సర్దుబాటు జరుగుబాటు
అంటువ్యాధి రాజకీయ రోగిష్టుల
గాలి మనకు సోకవద్దు

చరిత్ర రథాన్ని లాగే
శ్రామికుల్ని సంతల్లో కొల్లగొట్టే
ప్రజల్ని మత్యపెట్టే
'సంఘ వ్యతిరేకశక్తుల' నిర్మూలనకై
వేలైనా లక్షలైనా ఒక్కరుగా
లక్ష్యంమీది గురితో ఉరితాళ్ళకైనా వెరవక
తుపాకిగుళ్ళకైనా జైళ్ళకైనా జంకక
ఒక్కటిగా నిర్మాణం సాగించండి

కోట కోశాగారం
గండి తెగిన చెరువయ్యింది

కోటలో యంత్రాంగం
పిచ్చెత్తి ఆస్పత్రిపాలైంది

కోటలో ప్రజాస్వామ్యం
కొందరి స్వరాజ్యమైంది

ప్రపంచంలో తన సంతతి
పడిపోతున్న దృశ్యం
అది చూస్తూనేవుంది

కోటకు నోట మాటలేక
అన్నమాటకు పునాదిలేక
తనమీద తానే విశ్వాసం కోల్పోయింది

కుంటుతున్న ఇప్పుడే ఇప్పుడే
పరిగెత్తి కొట్టండి
అది కూలినా ఇంకా కుంటినా

మన పరుగు వృథా కాదు
మన దెబ్బ వృథా పోదు.

## తెలుగు ప్రజల పోరాటాగ్నులనుంచి
## విప్లవ మహోజ్వాల రగుల్కొవాలి.

ముల్కీ సమస్యమీద మొదలైన ఆందోళన తెలుగుదేశంలోని రెండు ప్రాంతాలలోను ప్రభుత్వ వ్యతిరేక మహోద్యమంగా కర్రిమేపి రూపొందుతూ వుంది. అఖిల భారత స్థాయిలో పాలకవర్గముయొక్క ఆర్థిక-రాజకీయ విధానాల దివాళాకోరుతనం ఫలితంగా ప్రజలు చైతన్యవంతులై తిరుగుబాటు మార్గాలను వెతుక్కుంటున్నారు. ప్రాంతీయ అసమానతలవల్లనో, నిరుద్యోగానికి నిరసనగానో, ఉద్రేకపూరితంగాలేచిన తాత్కాలిక పాక్షిక పోరాటాలుగా ప్రారంభమైనా, ప్రజల అసంతృప్తి తీవ్రరూపం ధరిస్తూ ప్రభుత్వ వ్యతిరేక ప్రజాపోరాటంగా పరిణమిస్తున్నది. అగ్నిపర్వతము బద్దలవుతూ లావా ఉరకలెత్తుతూ వుంది. ఈ దృశ్యాన్నిచూసి కంపరమెత్తుతున్న ఇందిరా ఫాసిస్టు ప్రభుత్వం తెలుగునేల అంతటా ఉక్కుటోపీల రిజర్వు పోలీసు మూకలను, సైనిక దళాలను దించి దేశాన్ని సైనిక శిబిరంగామార్చి, శ్మశానప్రాయమైన "సమైక్యత"ను కాపాడ బూనుకుంది. పరస్పర విభేదాలను రెచ్చగొడుతూనే, కృత్రిమంగా, ప్రజాభీష్టాలకు విరుద్ధంగా, ఉభయప్రాంతాలను కలిపి కట్టివుంచడానికి, ఇప్పటికే ఈ ప్రభుత్వం వందలాది ప్రజలను నిర్విచక్షణగా చంపి, వేలాదిమందిని వికలాంగులను చేసింది. తాము ప్రకటించిన పంచసూత్రాలను, తమ వర్గాధికారాన్ని రక్షించుకొనేందుకు పాలకవర్గం ఈ ఉప్పెనను లాఠీలతో, తూటాలతో, సన్నీలతో అణచబూనుకుంది. ఈ కిరాతక చర్యలకు వ్యతిరేకంగా భయావహ పరిస్థితుల్లో కూడా తమ ఉద్యమాన్ని కొనసాగిస్తున్న ప్రజల పోరాటతీవ్రతను విప్లవరచయితల సంఘం అభినందిస్తున్నది.

ఈ ప్రజా మహోద్యమ శక్తిని తమ కుటిల ప్రయోజనాలకు కైంకర్యం చేసుకోకుండా పాలకవర్గపు తాబేదారులైన కపట రాజకీయ నాయకుల కుహకాలను మెలుకువతో కనిపెట్టి వోడిస్తూ, ప్రత్యేక రాష్ట్ర సాధనలతోనే తృప్తిపడకుండా సోషలిస్టు సమాజ స్థాపనకై దీర్ఘకాలిక సాయుధ విముక్తి పోరాటాల వైపుగా ముందుకుసాగాలని తెలుగు ప్రజలకు విప్లవ రచయితల సంఘం విజ్ఞప్తిచేస్తున్నది.

## వియత్నాంపై అమెరికా విధ్వంసకాండ.

వీర వియత్నాంపై నిక్సన్ కొనసాగిస్తున్న పాశవిక బాంబుదాడులు, దురాక్రమణ యుద్ధం అమెరికన్ సామ్రాజ్యవాదం యొక్క ఫాసిస్టు నీచత్వానికి ప్రబల నిదర్శనం.

ఉత్తర వియత్నాంతో శాంతి సంభాషణలు జరుపుతామని ప్రపంచాన్ని మభ్యపెడుతూ, మరోవైపు విచక్షణారహితంగా బాంబులు కురిపిస్తూ, పెట్టుబడిదారి దేశాలకు సహితం కోపం తెప్పించిన నిక్సన్-కిసింగర్ కిరాతక చర్యను వి.ర.సం. నిశితంగా ఖండిస్తున్నది.

దక్షిణ వియత్నాం విప్లవ ప్రభుత్వాన్ని (P.R.G.) గుర్తించకుండా నీళ్ళు నములుతున్న భారత ప్రభుత్వ బూటక విధానాలను, సోషల్‌సామ్రాజ్యవాదుల కుమ్మక్కు స్వభావాన్ని వి.ర.సం. నిరసిస్తున్నది.

ధ్వంసమౌతున్న తమ నగరాలలోకూడా చెక్కుచెదరని గుండెధైర్యంతో అమెరికన్ విమానాలను కూలదోస్తూ, నూతన తరాల జీవితానికి ఊపిరిపోస్తూ ప్రపంచ జాతీయ విముక్తి పోరాటాలకు ఆదర్శంగా నిలిచిన వీర వియత్నాం ప్రజలను వి.ర.సం. అభినందిస్తున్నది.

## మొగ్గలోకొట్టి మొర మొర

సృజన జూన్ '72 సంచిక, రక్తగానం నిషేధాలు - ఖండన.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విప్లవ రచయితల సంఘం ప్రచురించిన "ఇప్పుడువీస్తున్న గాలి" కథా సంకలనం నిషేధం చేయడంతో ఆగిపోకుండా సృజన '72 జూన్ సంచికను, అనంతపురం చైతన్య సాహితి ప్రచురించిన "రక్తగానం" కవితాసంకలనాలనుకూడా నిషేధించింది. నిషేధసందర్భంలో పాడుతున్న 'రాజద్రోహనేర'మనే పాతపాటతోపాటు 'మతరాగం' పాడింది.

సృజన జూన్ సంచికలోని కవితల్లో మతవిద్వేషాలను రెచ్చగొట్టేభావాలున్నా యనే విడ్డూరమైన పిలకసెక్షన్ ఒకటి ఆరోపించింది. సెక్యులర్ రాజ్యాంగ సూత్రాన్ని కుల మత ప్రాతిపదికమీద అమలుచేస్తున్న ప్రభుత్వం కుల మత వివక్షలేకాదు వర్గాలుకూడ లేని సమాజంకోసం సాంస్కృతిక పోరాటం సాగిస్తున్న విప్లవ సాహిత్యాన్ని నిషేధించడం దాని మతోన్మాద కులోన్మాద ఫాశిస్టు స్వభావాన్ని బయటపెట్టుకోవడమే.

ఒకవంక అరవింద విద్యాలయ సంస్కృత విశ్వవిద్యాలయస్థాపనవంటి ఛాందస ఆలోచనలుచేస్తూ విశ్వవిద్యాలయాల్లో విద్యార్థి పరిషత్‌బోర్డు చాటున ఆర్. ఎస్. ఎస్. దుండగులు జరుపుతున్న దౌర్జన్యాలపట్ల ఉదారత్వంవహిస్తూ విప్లవ సాహిత్యం మతవిద్వేషాలను రెచ్చగొడుతున్న దనడం మొగుణ్ణికొట్టి మొరమొర అన్నట్లుగానే వున్నది.

ప్రజలు యీ ప్రభుత్వ మతోన్మాద, కులోన్మాద స్వభావాన్నిగర్హిస్తూ విప్లవ సాహిత్యాన్ని కాపాడుకోవాలని వి.ర.సం. విజ్ఞప్తి చేస్తున్నది.

## పెరుమాళ్లు మృతికి సంతాపం

తెలుగు ప్రజలను ఫ్యూడల్ పెట్టుబడిదారి విధానాలకు వ్యతిరేకంగా పోరాడేందుకు చైతన్యవంతుల్నిచేసి ప్రజానాట్యమండలినాటకాల్లో చిత్తశుద్ధితో తన పాత్ర నిర్వహించిన శ్రీ పెరుమాళ్లు మృతికి వి.ర.సం. తన గాఢ సంతాపాన్ని వ్యక్తచేస్తున్నది.

[ విప్లవ రచయితల సంఘం అత్యవసర కార్యవర్గ సమావేశం 7-1-1973 నాడు హైదరాబాద్‌లో శ్రీ కె.వి. రమణారెడ్డి అధ్యక్షతన జర్గింది. చర్చానంతరం పై తీర్మానాలను కార్యవర్గం ఆమోదించింది. ]

(గత సంచిక తరువాయి)



# ఉప్పెన

ఇంతవరకు జరిగినకథ

'యువాన్ మావో' అనే గ్రామానికి భూసంస్కరణ కార్యకర్తలు పదిహేనుమంది వచ్చేరు. వాళ్ళ నాయకుడు సియావో.

వాళ్లు వచ్చేరని—లేనివాళ్లు పండుగ చేసుకుంటే ఉన్నవాళ్ళు వాళ్ళనెలా మట్టు పెట్టాలా అని మంతనాలు జరిపేరు. ఇళ్లల్లోని డబ్బు, నగలు, సామాను పట్నం తరలించేరు.

## ఇంతవరకు వచ్చిన పాత్రల పరిచయము

సియావో— పూర్తి పేరు సియావో సియాంగ్. భూసంస్కరణ కార్యకర్తల దళానికి నాయకుడు. ముప్ఫయ్యేళ్ళుంటాయి.

చిన్నవాంగ్ లియూ షెంగ్— వీళ్ళిద్దరూ ఆ దళం సభ్యులే.

వాన్— పూర్తి పేరు వాన్‌చీన్. నాయకుడు సియావోకి అంగరక్షకుడు.

ఓల్డ్‌సన్— బండివాడు. ఏభైపైన వుంటుంది వయసు. గొప్ప సరదా మనిషి.

హాన్— 'ఆరో నెంబర్ హాన్'అంటారు. పూర్తి పేరు హాన్ షెంగ్-ఛీ.

తు — తుషాన్-ఫా ఇతని పూర్తి పేరు- మంచి మనిషని పేరు సంపాదించేడు. (పేరుకే మంచి మనిషి)

తాంగ్— పూర్తి పేరు తాంగ్ తీన్. అంత మంచి పేరు లేదితనికి. హాన్, తు, తాంగ్- వీళ్ళు ముగ్గురూ 'దుష్టత్రియం'. ఆ వూళ్ళో పెద్ద మోతుబరులు.

ఆయి-చెంగ్— హాన్‌గారి కూతురు. శతమొండి. మగవాళ్ళని వశపర్చుకోడంలో అందెవేసిన చెయ్యి.

లీచెన్-చియాంగ్— హాన్ దగ్గిర కౌలుదారు. హాన్‌కి ఏజెంటు. నమ్మినబంటు.

తీన్ — తీన్ వాన్-షున్ ఇతని పూర్తి పేరు. ఇతనూ హాన్‌దగ్గిర కౌలుదారే. కాని పరమ అమాయకుడు.

# 3

బండిలోంచి పెట్టేబేడా దింపుకొన్నతరవాత, స్కూల్లో అవన్నీ సర్దుకొన్నారు భూసంస్కరణ కార్యకర్తలు. ఆ వెంటనే పట్నంతో టెలిఫోను సంబంధాలు ఏర్పాటు చేసుకొన్నారు. ఇక ఏమీ ఆలస్యం చెయ్యకుండా వెంటనే ముందు ముందు తాము చేయాల్సిన పనులగురించి చర్చ మొదలెట్టేరు.

స్కూలన్న పేరేగాని అక్కడ కుర్చీలూ లేవు, బల్లలూ లేవు. ధూళిపట్టిన డెస్కులు మాత్రం రెండు మూడు వున్నాయి. కొందరు పక్కబట్టలమీదా, కొందరు ఆ డెస్కులమీదా అలాగే సర్దుకొని కూర్చున్నారు. చిన్నవాంగ్ మాత్రం కిటికీఅంచు ఆనుకొని నించొని, అవతల రోడ్డువైపు చూస్తున్నాడు. ఊరు మధ్యనించీ పోతోంది రోడ్డు గుబురుగా పెరిగిన చెట్లమీద పిచికలు చేరి ఓ కొమ్మమీంచి మరోకొమ్మమీదికి ఎగురుతూ తెగగోల చెస్తున్నాయి. పిట్టలు కొన్ని ఎగురుతూ వచ్చి, టెలిఫోన్ వైర్ల మీదవాలి, పొట్టమీద ముక్కుతో సర్దుకోసాగేయి. రోడ్డుకి కొంచెం అవతలవున్న పచ్చిక బయలుమీద కొందరు పిల్లలు దొంగాట ఆడుతున్నారు. స్కూలు కిటికీ దగ్గిర ఎవరో కొత్తమనిషి నించోడం చూడగానే, పిల్లలంతా పరుగు పరుగున వచ్చి కిటికీ అవతల చేరేరు. ఒకర్నొకరు తోసుకొని మరీ లోపలికి చూస్తున్నారు పిల్లలు. వాళ్లలో ఒక కుర్రాడయితే కిటికీఅద్దానికి నొక్కుకుపోయి, సూది ముక్కు కాస్తా చప్పిడిముక్కు అయిపోతున్నా, అలాగే లోపలికి చూస్తున్నాడు. చిన్నవాంగ్ ఒక్కసారి కిటికీ తలుపులు తీసేడు. పిల్లలంతా తలో దిక్కూ పారిపోయేరు. వాళ్ళలో, ఒంటిమీద నూలుపోగైనాలేని చిన్నపిల్లవాదొకడు రాయి తన్నుకొని బోర్లాపడిపోయి 'బేర్'మని ఏడవడం మొదలెట్టేడు. కుర్రాడు పడిపోవడం చూసేడు చిన్నవాంగ్. పరిగెత్తి అవతలికి వెళ్ళి పిల్లణ్ని ఎత్తుకొని కళ్లు తుడిచేడు. ఇంతలో పరుగులు తీస్తున్న మిగతా పిల్లలంతా వచ్చి చుట్టూచేరేరు. పడిపోయిన అబ్బాయిని చూస్తూ

"పప్పుతింటే పారిపో
వుప్పుతింటే వూరిపో,
హూష్ మంత్రికాళీ!
....ఆటలో అంటిపండు...."

అంటూ పాడేరు.

పిల్లల్ని పంపించేక, చిన్నవాంగ్ మళ్ళీ తన స్థానానికి వచ్చి నించున్నాడు. అప్పటికే చర్చ కొంతవరకు జరిగిపోయింది. ఇప్పుడు వాళ్ళ ముందున్న సమస్య ఒక్కటే– వెంటనే ఒక బహిరంగసభ ఏర్పాటుచేసి ప్రజలతో తమ కార్యకలాపాల

గురించి చర్చించడమా? లేకపోతే ఇక్కడ చెరువులో చేపల్లాగవుండి ఇక్కడి పరిస్థితుల్ని అర్థం చేసుకొని, మనుషుల్తో స్నేహసంబంధాలు ఏర్పాటుచేసుకొని ఆ తరవాత అసలు కార్య క్రిమం మొదలుపెట్టడమా?

బహిరంగ సభే కావాలన్నాడు లియూషెంగ్. సభ అయితే పెట్టొచ్చు కాని జనం ఎక్కువమంది రారేమో అన్నాడు దళనాయకుడు సియావో. అందుచేత ఇక్కడ పరిస్థితులూ అవీ బాగా అర్థం చేసుకొనేదాకా సభలు వద్దు అన్నాడతను.

"మనం మొదట ఒక సభంటూ పెట్టకపోతే, ఈ జనాలందరికీ మనం యెందు కొచ్చేమో, ఏమిటో ఎలా తెలుస్తుంది? సభ పెట్టుకోకుండా వాళ్లని మనం ఎలా అర్థం చేసుకోగలం?" అన్నాడు లియూషెంగ్, కళ్ళద్దాలు తీసి తుడుచుకొంటూ.

"మనం ఎందుకొచ్చేమో వూళ్లో వాళ్ళకీపాటికి తెలిసేవుంటుంది. బహిరంగసభ పెట్టడంవల్ల పెద్ద ప్రయోజనం వుంటుందని నేననుకోను. జనం ఎక్కువమందిరారు. ఒకవేళ వచ్చినా మనం చెప్పేది వింటారే తప్ప మనతో ఏం మాటాడరు. మనం ఏదైనా అడిగితే, 'అవునవును. అలాగే' అంటారు వాళ్లు అవుననగానే మనం చెప్పిందంతా ఒప్పుకొన్నారనా? కాదు. ఎందుకంటే, మన ఈ సమాజం కొరకరానికొయ్య. జమీందారుల, జాగీర్‌దార్ల ఉక్కుపాదాలకింద వేల సంవత్సరాలుగా నలిగిపోతున్నారు బక్కరైతులు. ఇవాళ మనం ఏదైనా కొత్తవిషయం చెప్పగానే వాళ్లు మన మాట నమ్మేస్తారనుకోడం పొరపాటు. వాళ్ళతో కలిసిపోయి, వాళ్ళ కష్టసుఖాలు పంచుకొన్నపుడే వాళ్ళకి మనమీద నమ్మకం కలుగుతుంది. అప్పుడే వాళ్ళు మనసువిప్పి మనతో మాటాడతారు" అన్నాడు సియావో.

అతని మాటలు లియూషెంగ్‌కి నచ్చినట్టులేదు. ముఖమంతా కందగడ్డ చేసుకున్నాడు.

"అంటే మీ వుద్దేశం మనం ఒక సభపెట్టి, ఆ సభలో— 'ప్రజాద్రోహుల్ని అంతం చేద్దాం' అనగానే, పైకి 'సరే' అని, లోపల మాత్రిం వ్యతిరేకిస్తారంటారా, ప్రజలు" అన్నాడు.

తను చెప్పిన విషయంలో లోపాలు వెతకడానికీ, అందులో లేని అర్థాలు లాగడానికీ ప్రియత్నిస్తున్నాడనిపించింది సియావోకి, కొంచెం విసుగ్గా.

"నేనన్నానా, అలాగ?" అన్నాడు

సూటీపోటీ మాట ఏదో విసురుదామనుకొన్నాడు సియావో. కాని అంతలోనే మళ్ళీ వూరుకొన్నాడు.... తను పార్టీ సభ్యుడు. ఈ దళానికి నాయ

కుడు. తనకి ఓర్మి వుండడం ఎంతైనా అవసరం ఇంతకీ, తను తన వుద్దేశాలన్నీ ఇంకా పూర్తిగా చెప్పనేలేదుకద?

నెమ్మదిగా మళ్ళీ చెప్పసాగేడు సియావో, "నా వుద్దేశం ఏమిటంటే– ఈ వూరుకా మనం సరికొత్తవాళ్ళం. మన అనుపానులూ, మంచి చెడ్డలూ తెలియకుండా జనం వాళ్ళ కష్టసుఖాలు మనతో చెప్పరు. ప్రజాకంటకులంటే వాళ్ళకి ద్వేషం విపరీతంగానే వుంటుంది కాని. ఆ పీడ వదిలించుకోవచ్చునన్న సంగతి వాళ్ళకి తెలియదు. జనం శక్తి సామర్థ్యాలు జనానికి తెలియవు. తరవాత మరో విషయం, మనం ఎంత కాలం వాళ్ళకి అండగా నిలుస్తామోకూడా తెలియదు కదా వాళ్ళకి? అదీగాక, మన గురించి ఈపాటికే చెప్పుడుమాటలు వాళ్ళ చెవినిపడే వుంటాయి"అని ఆగేడుసియావో.

చర్చ ఆగిపోలేదు. సాగుతూనే వుంది. కొందరు లియూ కొమ్ము కాసేరు. మరి కొందరు సియావో మాట రైటన్నారు. ఇంకా కొందరయితే, పెద్ద బహిరంగసభ కాకపోయినా. చిన్న సభలాంటిది మాత్రం కావాలన్నారు. ఆఖరికి వోటింగు తీసుకొన్నారు. ఒక్క వోటు మెజారిటీతో లియూ షెంగ్ నెగ్గేడు.

లియూ ఆనందానికి హద్దుల్లేవు. వెంటనే ఓల్డ్‌సన్ దగ్గిరికి పరిగెత్తేడు. సభ వుంది. గ్రామస్థులందర్నీ తీసుకురమ్మని చెప్పేడు. డప్పొకటి తీసుకొని ఓల్డ్‌సన్ గ్రామమంతా దండోరా వేసేడు:

"ఇయేల రేత్రికి ఇస్కూల్లో మీటింగెడుతున్నారుగాబట్టి. ఇంటికి ఒక్కలేనా రావాలహో!"

హాన్‌గారింటినించి లీచెన్-చియాంగ్ వెళ్ళిపోయేక. 'దుష్టత్రయం' దీపందగ్గిర కూచొని మంతనాలు జరిపే సమయానికి, ఊళ్ళో జనం ఇద్దరేసీ ముగ్గురేసీ జట్టుజట్టుగా స్కూలు దగ్గిరికి రాసాగేరు. వచ్చినవాళ్ళు స్కూలు ఆవరణలో చెదురు మదురుగా నించొన్నారు. వాళ్ళలో ఎక్కువమంది ముసలివాళ్లూ. పిల్లలూను. టేబుల్ ఒకటి తెచ్చి దానిమీద యెక్కి నించున్నాడు లియూ షెంగ్. కొంత వుపోద్ఘాతం తరవాత ఇలా అన్నాడు.

"మనంవంతా కలిసికట్టుగా ఒకే తాటిమీద నిలిచి ఈ పీడకులందర్నీ ఎదిరించాలి! మనం పేదవాళ్ళం. అధికారాన్ని మనం హస్తగతం చేసుకోవాలి! అందుకు మనం సాయుధులం కావాలి!"అంటూ కొంతసేపు చెప్పి ఆఖరికి ఒక ప్రశ్న వేసేడు.

"ఈ ప్రజాకంటకుల్ని అంతం చెయ్యడానికి మీరంతా ఒప్పుకొంటారా?"

"ఒప్పుకొంటాం! ఒప్పుకొంటాం!!" అన్నాయి డజను కంఠాలు,

"నానూ అందు కొప్పుకొంటాను" అన్నాడో పండుగెడ్డపు వృద్ధుడు. అని వెనక్కి తిరిగి చూసి వెకిలినవ్వొకటి నవ్వేడు. అతనివెనక లీచెన్-చియాంగ్ నించుని వున్నాడు.

"సరే, చాలా సంతోషం. ఈ వూళ్ళోవున్న ప్రజాపీడకులు ఎవరు?"అన్నాడు లియూ.

అంతటా నిశ్శబ్దం. ఎవ్వరూ పెదవి మెదపలేదు.

"చెప్పండి! ఎవరూ మాట్లాడరేం? పోనీ నువ్వు చెప్పు బాబాయ్!"అన్నాడు లియూ పండుగెడ్డపు వృద్ధుణ్ణి వుద్దేశించి.

"జపానోళ్ళు లొంగిపోనాకే* నానీవూరొచ్చినాను బాబూ. అంతకు ముందు ఈ వూరేటో చంగతేటో నాకు తెలనేతెల్దు"అన్నాడు వృద్ధుడు. వెనక నించున్నలీచెన్-చియాంగ్ అతని చెవిలో ఏదో గొణిగేడు. వృద్ధుడు మళ్ళీ అన్నాడు. "నా ఎరికలో పెద్ద కాంపందులెవరూ ఈ వూల్లో నేరు బాబూ!"

లియూ వెంటనే అడిగేడు, "అలాంటప్పుడు వాళ్ళని అంతం చేద్దామంటే యెందుకు ఒప్పుకొన్నావు?"

"అలాటోల్లు ఈ వూల్లో నేరని సెప్తున్నానుగదా బాబూ! పొరుగూర్లంట శానా మందిరున్నారు. మనం ఆల్లపని పట్టిద్దాం"అన్నాడు పండు గెడ్డం (అతన్ని 'తెల్లమేక' అని పిలుస్తారు జనం)

"బాబూ! నాదొక మాట. సెలవియ్యమంటావా?"అన్నాడు నల్లటి టొక్కిటోపీ పెట్టుకొన్న మరో వృద్ధుడు. "స్రుష్టి ఆరంబం ఆయినకాణ్ణించి ఇయేలదాకా ఒకటే నాయం. అదేటంటే— నోరున్నోడిదే రాజ్జెం. గవర్మెంటేటి సెప్తే అది జరిగిపోద్ది. ఇప్పుడు మనందరమందికీ ఈ దలపోల్లే గవర్మెంటు. మన్లాటి పేదోల్లందరికీ సాయం సేస్తామంటున్నారీళ్ళు. వూల్లో బుగతల్ని దుంప నాసినం సేసేస్తామంటున్నారు. అంతకంటె మనకి మాత్తరం కావలిసిందేటి?"అని, జనంవైపు తిరిగి "ఏటబ్రా, ఎరోరిట్నా! మీరంతా ఒప్పుకొంటారా?"అన్నాడు.

ఒప్పుదలని సూచిస్తూ కేకలు. అరుపులు. ముసలివాళ్ళూ, పిల్లలూ— అందరి గొంతులూ కలిసిపోయేయి. ముక్తకంఠంతో 'ఒప్పుకొంటాం; ఒప్పుకొంటాం' అన్నారంతా.

నల్లటోపీ ముసలతను మళ్ళీ చెప్పసాగేడు, "బాబులూ, మీ సెవుల్తో మీరే ఇన్నారుగా? మావోల్లంతా మీరు సెప్పిందానికి 'సై' అన్నారు. పొద్దుబోయింది. ఇక లెగు

*1945 లో

ద్దాంవా? ఎవ్వలేటనుకోంవంటే, నానిప్పుడింటికి పోయి తొంగుంటాను. రేపు తెల్లారి నెగిసి. మా కాంగు బాపుసేసుకోవాల. ఆటికిలు తయారు సేసుకోవాల, ఒల్లకూరు కుంటే, మంట సరిగా నెగక, పొగెక్కువా, ఏడితక్కువా అయిపూసుంటుంది. ఈ సలికాలంవంతా మా ముసిల్ది యంవ యాతన పడిపోద్ది ..."

"ఇప్పుడీ మీటింగుకాడ అయన్నీ ఎందుకేస్. ఇయ్యాల కాపోతే మరోనాడు బాపుసేసుకో నీ కాంగు!" అన్నారెవరో.

ఇంతలో మరెవరో కొంటెగా అన్నారు. "అవునవును. మన ముసిలిముండ కూతుర్లు ఎలా సస్తున్నారో ఎవలికీ అక్కర్నేదు. ఈ దలపోళ్ళకి అంతకన్నా అక్కర్నేదు."

అంతా నవ్వేరు. పండుగెడ్డం, ఓ పక్కకి వెళ్ళి, నల్లటోపీ వృద్ధుణ్ణి పిలిచి, "నీక్కావాలంటే నువ్వెలిపో. ఎవరికోసం సూస్తున్నావు?" అన్నాడు.

నల్లటోపీని అలా వెళ్ళనిచ్చి తెల్లగెడ్డం ఇలా అన్నాడు: "బాబులూ, నాను కూడా బేగి ఎలిపోవాల. రేపు తెల్లారి నెగిసి, మాయమ్మాయిని సూడ్డానికి దాని అత్తారింటి కెల్లాల. పాపం బిడ్డ కంటిమీన కురుపు నెగిసిందంట."

ఇద్దరు ముసలాళ్ళూ చూపిన దారి మిగతా వాళ్ళంతా తొక్కేరు. అందరికీ తెల్లారేసరికి అర్జంటు పనులున్నాయి. ఒకతను పెరట్లో బంగాళా దుంపలు తవ్వుకోవాలి. ఓ బండివాడు గుర్రాలకి నాడాలు కొట్టించాలి. మరొకతను గడ్డి తెచ్చుకోవాలి. ఇంకొకతని భార్యకి సుస్తీ చేసింది: అందుచేత వంట అతనే వండుకోవాలి. ఇలాచెప్తూ ఒకరి తరవాత ఒకరు అలా నెమ్మదిగా బైట పడ్డారు.

"బుద్ధిలేని గాడిదలు!" అన్నాడు ఓల్డ్సన్. కాని చుట్టుపక్కల ఎవరూ లేకపోవడం చూసి, అతనూ చల్లగా జారుకొన్నాడు.

లియూ-షెంగ్ గదిలోకి వెళ్ళిపోయి మోకాళ్ళమీద మోచేతులు ఆన్చి తలపట్టుక్కూచున్నాడు.

"ఇలా అవుతుందని ఎవ్వరం అనుకోలేదు కదూ!" అన్నాడు కొంతసేపయేక.

కుంగిపోయిన లియూని చూసి అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించేడు సియావో.

"ఎందుకు అనుకోలేదు? సరిగ్గా ఎలా జరగాలో అలాగే జరిగింది. పోన్లే, ఒకందుకు మీటింగు పెట్టడమే మంచిదయింది. ఈ వూళ్ళో పరిస్థితులు మనం అను

కుంటున్నంత అనువుగాలేవని తెలిసింది. తరవాత తొందరపడి ఏపనీ చెయ్యకూడదని కూడా తెలిసింది." అన్నాడు నాయకుడు సియావో.

తరవాత కార్యకర్తలంతా మళ్ళీ సమావేశమయేరు. ఈసారి ఏం చెయ్యాలో స్పష్టంగా తెలిసింది.

రేపు పొద్దున్నే బయల్దేరి పేద ప్రజల దగ్గిరికి పోవాలి. వాళ్ళలో కొంచెం చురుకైన వాళ్ళని కలిపెట్టి ఆ వూళ్ళో మోతుబరుల గురించిన భోగట్టాలు సేకరించాలి.

## 4

మర్నాడు ఇంకా సాంతం తెల్లారలేదు. అక్కడక్కడా కోళ్ళు కూస్తూనే వున్నాయి. భూసంస్కరణ కార్యకర్తలంతా ఒకరితరవాత ఒకరు బయల్దేరేరు. వాళ్ళు మొత్తం పదిహేనుమంది. చాంగూ *, మరో ఏది మందీ తుపాకులు పట్టుకొన్నారు. మిగతా నలుగురూ— అంటే, సియావో, లియూషెంగ్, చిన్నవాంగ్, వాన్‌చీన్— పిస్తోళ్లు పట్టుకొన్నారు. వాళ్ళంతా ఆ రోజు తెల్లవారుజామునే లేచి, చద్దన్నం తిని బయల్దేరేరు. వెళ్ళి పేదవాళ్ళతో పరిచయాలు చేసుకొని, మళ్ళీ సాయంకాలానికల్లా స్కూలుకి తిరిగిరావాలని నిర్ణయించుకొన్నారు. వెళ్ళిన చోట ఎవరింట్లో తిండి తింటే, వాళ్ళకి యివ్వడం కోసం కొంచెం డబ్బులుకూడా తీసుకువెళ్లేరు.

ఊరికి ఉత్తరంగావున్న కుటుంబాల్ని కొన్నింటిని చూసేక దక్షిణదిశగావెళేడు చిన్నవాంగ్. దారిలో దిసమొలతోవున్న కుర్రాడొకడు ఓ గుడిసెముందు ఆడుకొంటూ కనిపించేడు. మరోసారి ఆ కుర్రాణ్ణి తేరిపార చూసేడు వాంగ్. ముందురోజు స్కూలుదగ్గిర పరిగెడుతూ పడిపోయింది ఆ కుర్రాడే. దగ్గిరికి వెళ్ళి, వాణ్ణి యెత్తుకొన్నాడు.

"నీ పేరేంట్రా బాబూ?" అడిగేడు వాంగ్.

"నా పేరు సో-చూ!" అన్నాడు కుర్రాడు, వాంగ్ జేబులో వున్న పిస్తోలు కుచ్చుతో ఆడుకొంటూ.

"నీ కెన్నేళ్ళు?"

"మా యమ్మేంవో, నాకు అయిదేల్లంటాది. మా యయ్యేంవో, వుంకో రొండేల్లు పోతే నాకు పందులుకాసే ఈడొచ్చేస్తాదంటాడు. మంచోడు కాదు మాయయ్య!

* ఇతను సెషన్ లీడరు.

మాయమ్మే మంచి. మాయయ్యయితే, పెతీ దానికీ కసురుకోడఁవే! ఓరోజేఁవో,— 'నాన్నీకు తిండెట్టలేను: పనేదేనా సూసుకుపోరా!' అనీసినాడు నానొప్పలేదు. 'నా నెల్లను. కావాలంటే నువ్వే ఎలిపో' అన్నాను. అనగానే సెంపమీద సెల్లుమనేసీసినాడు దెబ్బ!"అన్నాడు కుఱ్ఱాడు.

"ఏడీ, మీ నాన్న? ఇంట్లో వున్నాడా?"

"సూడు. లోపల నేడా?"

తడక తలుపు తోసుకొని ఆ గుడిసెలోంచి ఒకతను బైటికి వచ్చేడు. చిన్నగోచీ తప్ప అతనికి ఒంటిమీద మరేంలేదు. చుట్ట కాల్చుకొంటూ బైట నిల్చున్నాడతను. అతనికి ముప్ఫయ్యేళ్ళుంటాయి. మనిషి మరీ లావుకాదు; మరీ సన్నంకాదు. సామాన్యంగా వున్నాడు. అతన్లో అన్నిటికన్నా వెంటనే ఆకట్టుకొనేది— చెదపట్టిన ముళ్ళ పొదలావున్న అతని చింపిరి గెడ్డం.

అతనిపేరు చావో యు-లిన్. 'మొండి మెలలిన్'అని పిలుస్తారు వూళ్ళోవాళ్లు. ఆతనికి పెళ్లాం, పిల్లడూ వున్నారు. తినడానికి తిండీ, కట్టుకుందికి గుడ్డా— అతనికి ఎప్పుడూ కరువే. ప్రాణమా, మానమా? ముందు దేన్ని రక్షించుకోవాలి? ఆదే అతని సమస్య. కడుపుకి వుంటే కట్టుకుందికి లేదు. ఆ కారణంచేత అతనూ, అతని భార్యా, కొడుకూ ఎప్పుడూ నగ్నంగానే వుండవలసి వచ్చింది. చలికాలంలో మరీ యాతన. ముగ్గురూ కాంగ్‌ని కరుచుకు పడుకొనేవారు. కర్రా కంపా ఏరుకొందికీ, వంట వండుకు తినడానికీ మాత్రం కాంగ్ దిగేవారు. వేసవి కాలంలో— చావో భార్య తెల్లారకముందే లేచి పనిలోకి వెళ్ళేది. మళ్ళీ బాగా చీకటిపడ్డాక ఇంటికి తిరిగివచ్చేది. పగలంతా ఎత్తుగా భుజాల్దాకా పెరిగిన పొలాల్లో పనిచేసేది. మొటట్లో ఈమె ఎందుకిలా చేస్తోందో వూళ్లోవాళ్ళకి తెలిసిందికాదు.

కాని ఒక రోజు మామూలుగా ఆమె పొలంలో పని చేసుకొంటూ వుండగా, ఎవరివో అరుపులూ కేకలూ వినిపించేయి. సంగతేమిటో తెలుసుకొందామని తలెత్తి చూసిందామె. రవికలేనందున ఆమె భుజాలు అవతలి వాళ్లకి వెంటనే కనబడిపోయేయి. ఊరంతా చావో భార్యగురించే గుసగుసలు మొదలెట్టేరు. చావోకి 'మొండిమొలవాడు' అని పేరు పెట్టేరు. నిరుడు* సోవియట్ సైన్యం ఆవూరుకి కాపలా వుంటున్నరోజుల్లో ఆ సైనికులు ఈ భోగట్టా విని, వెంటనే చావో కుటుంబానికి రెండు జతల యూనీఫా

---

* 1945 లో

రాలు ఇచ్చేరు. ఆఖరికి ఎలాగైతేనేం, గుడ్డముక్కలన్నవి దొరికేయి చావో కుటుంబానికి. ఇంక ఫరవాలేదు: బంధువుల్నీ స్నేహితుల్నీ ఇంటికి పిలవొచ్చు.

"రండి బాబూ! లోపలికి రండి!" అన్నాడు చావో వాంగ్‌ని పిలుస్తూ పిల్లణ్ణి ఎత్తుకొనే చావో ఇంట్లోకి వెళ్ళేడు వాంగ్. ఖాకీ చొక్కా తొడుక్కొన్న ఒకామె గడ్డి టోపీ బాగుచేస్తోంది. కొత్త మనిషి ఇంట్లోకి రావడంచూసి, చేతిలో టోపీ కింద పడేసి వెళ్ళిపోబోయింది.

"ఫరవాలేదమ్మా కూచో"అన్నాడు చిన్న వాంగ్, కుర్రాణ్ణి దింపి కాంగు మీద కూచోబెడుతూ. తనుకూడా ఓ అంచుని కూచొని చావో యిచ్చిన చుట్ట తీసుకొని ముట్టించేడు. రెండు మూడు గుక్కలుతాగి పొగ వదిలేడు. పసుప్పచ్చ పొగరింగులు తిరుగుతూ పోయి గదంతా అలుముకొంది.

పేద ప్రజలతో కలిసిపోడం ఎలాగో చిన్న వాంగ్‌కి బాగా తెలుసు. పొగాకు గురించీ, పాడిపంటల గురించీ మాట్లాడుతూ చావోతో కత్తు కలిపేడతను. మొదట అతను చెప్పిందంతా విన్నాడే తప్ప నోరు మెదపలేదు చావో. అప్పుడప్పుడు తల ఆడించేడు. మహాఅయితే 'వూఁ'అనో, 'వుఁహూ'అనో అన్నాడు. అలా కొంతసేపు విన్నాక చిన్నవాంగ్‌కి పొలాలూ, పంటలూ గురించి బాగానే తెలుసుననిపించింది చావోకి.

'ఈ మనిషికూడా పొలాలమీద పనిచేసినవాళ్ళాగే వున్నాడు' అనుకొన్నాడతను.

అలా అనుకోగానే ఈ కొత్తమనిషికీ తనకీ మధ్యనున్న అడ్డుగోడ ఏదో తొలగిపోయినట్టనిపించింది చావోకి. వెంటనే హాయిగా మాటాడేడు. చావో భార్య కూడా వాళ్ళతో మాట కలిపింది.

"మీ ప్రాంతాల్లో ఎకరానికి ఏ మాత్రం జొన్న పండుతుంది?" చిన్న వాంగ్ అడిగేడు.

"పండుతాది బాబూ! ఏదో బాగానే పండుతాది. పొలం మంచిదయితే వాలుగయిదు పుట్లదాకా దిగుతాది. మెట్టభూఁవికి ఒకటి రెండు పుట్లు మించి దిగదు"అన్నాడు చావో. అని మళ్ళీ— "ఈ ప్రాంతాలభూఁవి మంచిదే బాబూ! అయితేటి, దానికి తగిన మశాగత్తు దానికీ సెయ్యాలిగదా! 'కష్టేఫలీ' అన్నారు పెద్దలు. పెద్దలు సెప్పిన మాటా, పెరుక్కూడు మూటా అన్నారు. మంచి వొరసం కురిసి, పదునుమీన ఇత్తనాలు జల్లితే జొమ్మని లెగుస్తాయి, మూణ్ణెల్లు తిర్గీతలికి గింజలు సేతికందుతాయి...." అన్నాడు.

"నాకివాళ పొలం పనిగాని వుందా?" అన్నాడు చిన్నవాంగ్. మాటల్లో పెట్టి, అతని పని చెడగొడుతున్నానేమో అనిపించిందతనికి.

"పొలం పనేటి నేడుగాని ఇమేల పిండి ఆడించనానికెల్తాను:"

"మంచిది. మనిద్దరం కలిసే పెల్దాం" అన్నాడు వాంగ్, కొంగు మీద వున్న జల్లెడ తీసుకొంటూ.

పొరుగునున్న లియూతి-షాన్ ఇంటికి వెళ్ళేరు ఇద్దరూ. అతన్ని తిరగలి ఎరు వడిగి తిప్పడం మొదలెట్టేరు. పని చేసుకుంటూనే, కబుర్లలోకి దిగేరు. ఫలానా అని లేకుండా ఏదో తోచిందల్లా చెప్పుకుపోతున్నాడు చావో. చిన్నవాంగ్‌కేమో చావోని గురించిన వివరాలు తెలుసుకోవాలని వుంది. తనూ రైతు కుటుంబంలోంచి వచ్చినవాడే కాబట్టి వాళ్ళలో సులువుగా కలిసిపోగలడతను.

చిన్నవాంగ్‌ది హూలాన్ జిల్లా.[1] అతని తండ్రి జపాన్ వ్యతిరేక సైన్యం[2] లో ఆఫీసరుగా వుండేవాడు. జిల్లా స్థాయిలో పార్టీకి కార్యదర్శిగా వుండేవాడనికూడా అనేవారు. కీలుబొమ్మ మంచుకో ప్రభుత్వపు సైనికులు అతనికోసం తెగ తిరిగేవారు. ఆఖరికి 1933 సంవత్సరం శీతాకాలంలో అతను వాళ్ళకి దొరికిపోయేడు. వాళ్ళు అతన్ని చిత్రహింసలు పెట్టేరు, రహస్యాలు చెప్పమని. ప్రాణాలు పోతున్నా సరే, ఒక్క ముక్క కూడా శత్రువుకి చెప్పలేదతను. ఆఖరికి వాళ్ళు విసుగెత్తిపోయి అతన్నీ, మరో మూడు వందల మంది దేశభక్తుల్నీ గోనెసంచుల్లో కుక్కి ఓ కొండమీదికి తీసుకుపోయి కిందకి తోసేసేరు. గోనెసంచులు నెత్తురు ముద్దలయేయి. అప్పటికీ వాళ్ళ కసి తీరలేదు. రెండు లారీల నిండా ఆ సంచుల్ని సుంగారీ నదికి తీసుకుపోయేరు. గలగల పారేనది నిశ్చలంగా నిలబడిపోయివుంది. నదంతా గడ్డకట్టుకు పోయి వుంది. ఆ మంచుగడ్డలకి కన్నం పెట్టి ఒకటొకటే సంచులన్నీ జారవిడిచేసేరు.

తండ్రి పోయేనాటికి చిన్న వాంగ్‌కి అయిదేళ్ళు. మరో రెండేళ్ళ తరవాత, మంచుకో ప్రభుత్వ సైనికులు మళ్ళీ తయారయేరు. దేశభక్తుల్ని వెంటాడసాగేరు. తండ్రిపోయిన దగ్గర్నించీ చిన్నవాంగ్ కుటుంబానికి జపాన్ వ్యతిరేక సైన్యంతో సంబంధాలు తగ్గిపోయేయి. అందుచేత యెక్కడో ఒక చోటుకి పోయి తలదాచుకోవలసి

---

1 హూలాన్ జిల్లా సుంగారీ నదికి వుత్తరాన వుంది.

2 Anti-Japanese Amalgamated Armies of the Northeast. 1931లో ఈశాన్య చైనాని జపాన్ సామ్రాజ్యవాదులు ఆక్రమించేక చైనా కమ్యూనిస్టు పార్టీ ఈ పేరుతో ప్రజా సైన్యాన్ని ఆర్గనైజ్ చేసింది.

వచ్చింది. వాంగ్ చిన్నాన్న దక్షిణ దిశగా పారిపోయేడు. వాంగూ, అతని తల్లీ పడమరదిశగా పారిపోయేరు. ఏళ్ళతరబడివున్న చోట వుండక, తిండిలేక, ఎండకి ఎండి వానకి తడిసి, అలా తిరిగేరు తల్లీ కొడుకూ. పదకొండేళ్ళు వచ్చేక చిన్న వాంగ్ ఓ భూస్వామిదగ్గిర పందులకాపరిగా చేరేడు. రెండేళ్ళు పాటుపడ్డాక అతనికి పందులకాపరి నించి గుర్రాలకాపరిగా "ప్రమోషనొచ్చింది". పదహారేళ్ళ వయసుకే పొలాల్లో పెద్ద కూలీలు చేసే పని చేసేవాడు చిన్నవాంగ్, కాని, మనిషి కొంచెం గిడసబారినట్టుండి, చిన్నవాంగ్‌లాగా కనబడతాడేమో— "తాటికాయంత పనీ, ఈత గింజంత కూలీ."

తనకి ఏడేళ్ళవయసప్పుడు జరిగిన ఒక సంఘటన ఎన్నటికీ మర్చిపోలేదువాంగ్.

ఆ రోజు —

ఎండ మండిపోతోంది. ఎక్కడా కనుచూపుమేరలో పిట్ట లేదు. తనూ, తల్లీ శత్రువుకి దొరక్కుండా పారిపోతున్నారు. అంతలో ఎక్కణ్ణించి వచ్చేయో, నల్లటి మేఘాలు పరుగులుతీస్తూ వచ్చేయి. ఆకాశమంతా కారుమబ్బులు కమ్ముకొన్నాయి. అంతా చీకటయిపోయింది. టపటపా చినుకులు ఆరంభమయేయి. టపటప చినుకులు శూలాల్లా గుచ్చుకొంటూవుంటే చలిగాలి కత్తిలా కోస్తోంది. మహా ప్రళయంలావుంది. కుండపోతగా వాన. చీకటి. మెరుపుల వెలుగులు. పెళపెళ ఉరుములు, పిడుగులవాన.

వాంగూ తల్లీ తెప్ప తడిసిపోయేరు. తల దాచుకొందికి యెక్కడా చోటులేదు, కన్ను పొడుచుకున్నా కనబడని కటిక చీకటి. ఇంతలో మెరుపు మెరిసింది. వెలుగు చిమ్మింది. ఏదో గ్రామదేవత గుడి కనిపించింది. లోపల దూరేరిద్దరూ. చలికి పళ్ళు కటకట కొట్టుకొంటున్నాయి వాంగ్‌కి. కుర్రాణ్ణి గట్టిగా కరుచుకు పట్టుకొంది తల్లి. అంత చలిలోనూ, వెచ్చని కన్నీటిబొట్లు వాంగ్ ముఖంమీద రాలేయి. తలెత్తిచూసేడు.

"అమ్మా!"

"ఏం నాయనా?" అంది తల్లి తన కళ్ళు తుడుచుకొని కొడుకు కళ్ళు తుడుస్తూ.

"ఒరే అయ్యా! నువ్వు పెద్దయ్యేక ఆళ్ళు మీఅయ్యని ఎలా సంపేరో గుర్తెట్టుకుంటావు కదా! పగ తీర్చుకోవాల!! తీర్చుకోవాల!!!"

కట్టుకొన్న మొగుడు కసాయిమూకల చేతుల్లో కడతేరిపోయేక, వున్న వూళ్లో బతకడం ఇక అసాధ్యమనిపించింది వాంగ్ తల్లికి. ఏడేళ్ళ కొడుకుని తీసుకొని ఆపేద తల్లి ఎన్నో ఊళ్ళు తిరిగింది. వాణ్ని పెంచి పెద్దవాణ్ని చెయ్యడానికి పడరాని పాట్లు పడింది. ఆవిడ చదువుకోలేదు. కాకపోతే పాతకాలపు మనిషేమో, కొంచెం వెర్రి బాగుల్ది. ఒకటి కాదు, రెండు కాదు— తొమ్మిదేళ్ళు— ఒక పూట తింటే మరో పూట

తినక, ఒంటినిండా గుడ్డలేక, ఆమె కటిక దరిద్రం అనుభవించింది. కొంచెం పెరిగేక వాంగ్‌కూడా కూలిచేసి తల్లికి సాయం చేసేవాడు.

వాంగ్‌కి పదహారేళ్ళప్పుడు క్షయరోగంతో ఆ తల్లి చనిపోయింది. కడసారిగా ఆనాటి వాన రాత్రి గుడిలోచెప్పిన మాటలే మళ్ళీ చెప్పింది.

"ఒరే అయ్యా! నువ్వు పెద్దోడివయ్యేవు. మీ నాయన్ని ఆళ్ళెలా సంపేరో గుర్తెట్టుకు టావు కదయ్యా "

తండ్రి దారుణమరణాన్నీ, తల్లి కన్నీటివరదనీ వాంగ్ ఎన్నటికీ మరిచిపోడు.

నిఐడు[1] జపాన్‌వాళ్ళు లొంగిపోయేక, అతను సైన్యంలో[2] చేరేడు. అలనాడు దక్షిణదిశగా పారిపోయిన చిన్నాన్న గురించి ఈమధ్యే కబురు తెలిసింది ... ఆనాడు అతనలా పారిపోయి పారిపోయి ఆఖరికి 'చైనాగోడ' అవతల తలదాచుకొన్నాడట. ఏళ్ళతరబడి "భయంకర బాధల పాటల పల్లవి" నాలాపించి, చివరికి అతను కూడా సైన్యం[3]లోనే చేరేగట.

ఆ సంవత్సరం[4] కమ్యూనిస్టుపార్టీ గ్రామసీమల్లో పనిచెయ్యడానికి పన్నెండువేల మంది యువకులు కావాలని పిలుపిచ్చింది. పిలుపునందుకొన్నాడు వాంగ్. సియావో సియాంగ్ నాయకత్వానగల దళంలో చేరేడు. ఏనాడూ చదువు సంధ్యలు లేవుగనక.

మొదట్లో ఓనమాలుకూడా రావతనికి. కాని పార్టీ పుణ్యమా అని ఏడెనిమిది నెలల్లోనే కొద్దోగొప్పో చదవడం రాయడం వచ్చేసేయి. "ఇప్పుడు నా పొట్ట చించితే పేగులే కాదు; అక్షరం ముక్కలుకూడా దొరుకుతాయి"అంటూంటాడతను.

మధ్యాన్నం భోజనాల వేళదాకా పాటుపడి, పని పూర్తి చేసేరు చావో, వాంగూ. తరవాత చావో ఇంట్లో అన్నం తిని, చుట్టలు ముట్టించుకొని, మళ్ళీ బైటపడ్డారు. ఈ సారి తను కొలుకి తీసుకొని పని చేస్తున్న కూరగాయల తోటలోకి తీసికెళ్ళేడు చావో.

---

[1] 1945 లో

[2] వాంగ్ చేరిన సైన్యంపేరు United Democratic Army. Eighth Route Armyలో ఇదొక భాగం. 1945 లో జపాన్‌వాళ్ళు లొంగిపోయిన తరవాత ఈ U.D.A. ని జనరల్ లిన్ పియావో నాయకత్వాన ఈశాన్య చైనాకి పంపించేరు. దీన్నే ఆ తరవాత చైనా ప్రజావిముక్తి సైన్యంలో నాల్గవ దళంగా పిలిచేవారు.

[3] వాంగ్ చిన్నాన్న చేరింది— Eighth Route Army లో

[4] 1946 జూలై నెలలో

చావో కొన్నాళ్ళకిందట హాన్‌గారి పొలం దున్నేవాడు. కాని ఆయనగారికి శిస్తు చెల్లించేక చావోకి ఇక మిగిలేది చేతికి చిప్పే! దాంతో ఆ పొలం వదులుకొని, 'తు' గారి తోట కౌలకి తీసుకొన్నాడతను. ఆ తోటలో చిక్కుడు కాయ, బంగాళాదుంప, బీరకాయ, బెండకాయ, పొట్లకాయ— ఒకటేమిటి అన్నీ పండిస్తాడతను. పండిన పంటలో సగానికిపైగా శిస్తుకింద ఇచ్చేస్తాడు. కొంత అమ్మకానికి పెడతాడు మిగిలింది ఇంట్లో వాడకానికి. ఒక్కొక్కప్పుడు ఇంట్లో బియ్యం నిండుకొంటె ఈ బఠాణీలూ, బంగాళా దుంపలే వాళ్ళ ఆహారం. చావోకి ఆ తోటంటే పంచప్రాణాలూను ఎక్కడా పురుగూ గిరుగూ పట్టకుండా కంటికి రెప్పలాగ చూసుకొంటాడతను. కాని మొన్న నీమధ్య వచ్చిన తుఫానుదెబ్బకి చిక్కుడుపాదు పందిరంతా కూలిపోయింది.

ఆ పందిరి బాగుచేస్తూ కూర్చున్నారు— వాంగూ, చావో లిద్దరూ. పనిచేస్తూనే చావో కబుర్లు చెప్తున్నాడు. ఎంతకీ మరొకళ్ళ గురించే చెప్తాడుగాని, తన గురించి మాత్రం ఒక్క ముక్కైనా చెప్పలేదతను. కాని మళ్ళీ కొంత సేపయ్యాక మరి ఏమనుకున్నాడో ఏమో తన కథ కూడా వాంగుకి చెప్పసాగేడు.

"ఇయ్యాల్టికి పద్నానుగేళ్ళో పదేనోళ్ళో అవుతాది. ఆయేడు మా వూరికి* కరువొచ్చింది బాబూ! బతికుంటే బలుసాకేనా తినొచ్చుననుకుని యీ దేశం వలపొచ్చీసినాను. నానిక్కడికొచ్చీసరికి ఈవూర్లొ పోలీసోళ్ళదే రాజెం. నాకాడ అల్లక్కావల్సిన కాయితాలూ గీయితాలూ లేవంట. అందుకని 'నువ్వు ఇక్కడ సొతంతరింగ ఏ పనీ చెయ్యడానికొల్లకాదు' అనీసినారాళ్లు. అందుచేత హానుబాబుకాడ పనిక్కుదుర్కున్నాను. పొట్టశేతపట్టుకొని పై దేశంనించి వచ్చినోణ్ణిగదా. నా జీతం గీతం అంతా ఒక్కపాలే ఏడాది సివర్నిస్తేగాదా? అఁహ! అలాగిస్తే ఆ బాబు హానుబాబెందుకవుతాడు? ముష్టేసినట్టు అప్పుడో అర్దనా, అప్పుడో కానీ యిచ్చీవోడు. మొత్తానికి మనం యేదేన కొనుక్కోని సొతంతరింగ బతుకుదాఁవంటె సేతిలో కానీలేకండ సేసినాడు. సేసి ఒల్లకున్నాడా? నానే ఆ బాబుకింక ఇయ్యాలంట పొంద రూపాయిలు! అప్పుడప్పుడడిగి ఒట్టుకు పోనానంట! డబ్బు ఇచ్చుకోనేకపోతే, నా నలికోటుబాబూ,— నీలంది; మా వూర్లొ కొనుక్కున్నాను— అదిచ్చీమన్నాడు. ఉన్న పలంగ కక్కమంటే అంతడబ్బు నాకెక్కడిదీ?.... కోటే సదివించుకున్నాను. ఆ మరుసటేడు మా యమ్మా, మా యావిడా యిక్కడికొచ్చినారు. దారికర్చులికిపోను కొంత సొమ్ము మిగిలింది ఆళ్లకాడ. దాంతో హాను బాబు నౌకరీకి సలాం కొట్టి, ఓ సిన్న మడి శెక్క కొనుక్కున్నాను.

---

* షాంతుంగ్ జిల్లాలో ఓ పల్లెటూరు

అయితే బాబూ, దేనికైన అదురుస్టం కలిసిరావాల. బూఁవి బాగుసేసి ఇత్తనాలు జల్లే టయాంలో పోలీసోల్లొచ్చి లేబరు కేంపుకి నన్ను లాక్కుపోనారు. కేంపులో వనంటే నీకు తెలుసుకదా, గొడ్డుశాకిరికన్న గోరం. ఇరవైరోజులపాటు రేత్రి పగలూ కంటి మీన కునుకన్నది లేకండ పన్జేయించినారు మాసేత. రోజుకి రెండుతపవలు తిండెట్టే వోరు. కాని బాబూ, అది తిండిగాదు. పందులుకూడా మూసూసి పారిపోతాయి. కానేటిసేస్తాం? అదే పరమాన్నంలాగ తినీవోల్లం. ఒకడు కాదు, ఇద్దరు కాదు, వొందల మంది తిండి సాలక కొందరూ, నడికి కొయ్యగట్టుకుపోయి కొందరూ సచ్చి పోనారు. సచ్చిపోయినోల్లెంతమందో ఎవడికీ లెక్కతెలీదు." అని ఒక్కక్షణం ఆగి, వాంగ్ కళ్ళలోకి చూసేడు. "వాంగ్ బాబూ! అదేటోగాని నా పేనం మాత్రంగొప్ప గట్టిది బాబూ! ఎన్ని సుట్లో సావుకి బెత్తెడు దూరందాకా ఎల్లినానేగాని నాకు సావు రానేదు. కేంపునించి తిరిగొచ్చి సూస్తే ఇక్కడేటుంది? నా తల్లి నడికీ, ఆకలికీ దొరికి పోయి సచ్చిపోనాది. నా పెల్లం పిల్లడూ ముద్దెత్తుకోని ఈదులంట తిరుగుతున్నారని తెలిసింది. నా పొలం సూసినోడులేక నాసినం అయిపోనాది. మావోల్లకోసం తెగ ఎతికినాను. ఆ దినం మా యావిడా నా కొడుకూ తెగ ఏడిసినారు. నోట మాట రానే దంటే నమ్మ. కాని వాంగ్‌బాబూ నానేడనేదు. మన్లాటి పేదోల్లం ఏడుస్తూకూసుంటే సివరికి మన కన్నీల్లలోనే పడి మునిగి సస్తాం మనం"అంటూ ఆగేడు చావో.

చిన్నవాంగ్ కళ్ళు చెమ్మగిల్లాయి. ఒక్కక్షణం ఏదో ఆలోచించి అడిగేడు.

"అవునూ, నువ్వు హాన్‌గారింట్లో పని చేసేనన్నావు కదా! అంటే ఆరో నెంబరు హౌవంటారు అతవింట్లోనేనా?"

'అవున'న్నట్టు తలాడించేడు చావో.

"ఆతనికి ఏమాత్రం పొలం వుంటుంది?"

"సరింగ నాకూ తెల్దు"అని, అటూ ఇటూ చూసేడు చావో. "ఈ ఒక్కవూల్లో దగ్గిర దగ్గిర అయిదొందల ఎకరాల్దాక పొలం ఆ బాబుదే! పోతే పొరుగూర్లంటకూడా శానా పొలాలున్నాయి."

"అతను మనిషిలాంటివాడు?"అన్నాడు వాంగ్, చావోని క్రీగంటచూస్తూ.

"హాన్ సంగతా బాబూ అడిగేవు? 'ఆడు సెయ్యని సెడ్డపనీ, సేసిన మంచి పనీ ఒక్కటికూడా లేదం'టారుజనం." ఆ మాట చెప్తున్నప్పుడు చావోముఖం తెల్లగా పాలిపోయింది. కళ్ళదగ్గిర ముడతలు స్పష్టంగా కనిపించేయి.

ఆ మధ్యాన్నమంతా యిద్దరూ అలా పనిచేసుకొంటూనే లోకాభిరామాయణం చెప్పుకొన్నారు. పాదులకి గొప్పులు తవ్వి, తీగలు సరిగ్గా పాకేలాగ పందిరికి కదు

తున్నాడు చావో. కందిరీగలు ఏదో కొంపమునిగిపోతున్నట్టు తెగ గొడవచేస్తున్నాయి. కాని నిజానికి వాటి సంగీతమే లేకపోతే తోటలో వాళ్ళిద్దరి మాటలూ రోడ్డు పక్క పోయేవాళ్ళకి కూడా వినిపించేవి. హాన్‌గురించి తనకి తెలిసిన సంగతులన్నీ చెప్పేడు చావో.

మంచుకో ప్రభుత్వం[1] ఆ ప్రాంతాల్ని పరిపాలిస్తూ వున్ననాటికి హాన్ పెద్ద ఉన్నవాడేం కాదు. కాని ఆ తరవాతే అతని ప్రభ వెలిగింది. దొరికిన చోటల్లా[2] పొలాలు తెగకొన్నాడు. 'అదృష్టదేవత'[3]లో చాలా వాటాలు చేజిక్కించుకొన్నాడు. మరో ఆరేళ్ళకల్లా గ్రామాధికారి అయేడు. పొన్నుగర్ర ఒకటి పట్టుకొని జనం మీద పడి పన్నులూ, పొగాకూ, పందిమాంసం- ఒకటేమిటి, వాళ్ల ఏదికావాలంటే అది వసూలుచేసి జపాన్ అధికారులకి సమర్పించుకొనేవాడు. మరో రెండేళ్ళలోనే డబ్బుకి డబ్బూ, అధికారానికి అధికారం ఎక్కువగానే సంపాదించేడతను. ఆ రోజుల్లోనే, జపాన్ సైనికాధికారి[4] నొకణ్ణి తన భవంతిలో 'మోరిటా తారో' అనే జపాన్ సైనికాధికారిని తన భవంతిలో కొన్నాళ్లు వుండవలసిందిగా ఆహ్వానించేడు. ఆ అధికారి గొప్ప రసికుడు. హాన్‌గారు తన కూతుర్ని అతనికిచ్చి పెళ్ళి చేస్తారని కొందరనుకొనేవారు. కాదు, కోడలు వాడి వలలో పడిందని మరికొందరనుకొనేవారు. ఇంకా కొందరైతే ఆ రసికావతంసుడు ఈ "గుంటలిద్దర్నీ సాకుతున్నాడ"నేవారు. ఏది నిజం? అయినా ఆ కోటగోడల వెనక భాగోతాలు పూటగడవని పేదజనాలకేం తెలుస్తాయి? ఒకవేళ యెవడికైనా తెల్సినా పాముతో చెలగాటం కాని మరోటికాదే? నోరు విప్పి 'ఫలానా' అని చెప్పడానికి దమ్ము లెవడికున్నాయి? ఏది ఏమైనా ఒకటిమాత్రం అందరికీ ఖచ్చితంగా తెలుసు. ఆ జపాన్‌వాడి రాకతో హాన్ దౌర్జన్యాలకి పట్టపగ్గాలేకుండాపోయేయి. కూలీనాలీ జనాల్ని దారుణంగా హింసించి మరీ పనులు చేయించుకొనేవాడు. కానీకూడా కూలికింద ఇవ్వకుండానే– ఇంట్లోకి కావలసిన నీరు మోయించుకొనేవాడు; పొయ్యిలోకి కర్రలు కొట్టించుకొనేవాడు; కొంగు బాగుచేయించుకొనేవాడు; ఇంటి పెంకులు తిరగేయించుకొనేవాడు; సున్నాలు వేయించుకొనేవాడు– ఒకటా? ఇలాగ సవాలక్ష

1. 1932 లో జపాన్ సైన్యం ఈశాన్యచైనాలో కీలుబొమ్మ(మంచుకో) ప్రభుత్వాన్ని నెలకొల్పింది.
2. యువాన్ మావో గ్రామంలోనూ, హార్బిన్‌లోనూ, ఛియా ముజూలోనూ అతనికి పొలాలున్నాయి.
3. 'అదృష్టదేవత' సారాబట్టీ పేరు.
4. 'మోరిటా తారో' అతని పేరు.

పనులు పురమాయించేవాడు. కొందర్ని పట్టుకుపోయి తన సొంతాబట్టీ పనిలో పెట్టే వాడు.

ఓసారి —

ఊరిజనమంతా వాడుకోడానికని చెప్పి, తన ఇంటిముందు ఓ నుయ్యి తవ్వింపించేడు హాన్. తీరా జల పడ్డాక నీటికోసం జనం వస్తే రౌడీలతో కొట్టించేడు. హాన్‌కి ఆశ్రిత పక్షపాతం లేకపోలేదు. తనకి ఇష్టమైనవాళ్లు మాత్రం ఆ నూతి నీళ్లు తోడుకో వచ్చుట. దాంతో జనం రుచ్చిపోయేరు. ఓ రోజు కొందరు కూడబలుక్కుని నూతి తగువు అటో ఇటో తేల్చుకోడానికని హాన్ ఇంటికి వెళ్లేరు. వీధిగుమ్మందగ్గిరేవాళ్లని ఆపేడు 'లీ'.*

ఇంతలో భవంతిలోంచి ఉరుములా వినిపించిందొక గొంతు.

"ఎవర్రా అది? ఏంకావాలి?"

"నుయ్యి యవహారం మాట్టాడ్డానికొచ్చినాం బాబయ్యా! నుయ్యి మాంవే తవ్వినాం" అంది ఒక పీలగొంతు. ఆ గొంతు ఓల్‌చాంగ్‌ది. అక్కడ చేరిన జనాలకి నాయకుడిలాగ ముందు నిల్చుని వున్నాడతను.

"ఓహో, అలాగా? మీరా తవ్వింది? అలాగని ఎక్కడేనా రాసి వుందిరా?" అన్నాడు బుగత, గాజుకళ్ళలోంచి నిప్పులు కక్కుతూ.

జనం నివ్వెరపోయేరు. నుయ్యి తవ్వడం అంటే శ్రమపడి తవ్వేరు గాని, దానిగురించి రాత కోతలూ, దాఖలాలూ వుంటాయని ఆ పేదప్రజలకి తెలియదు.

"అదేటి బాబయ్యా! అంతమాటనేస్తావా? తమరు సూడనేదా? మేంతవ్వినాం గాంవా?" అన్నాడు ఓల్డ్‌చాంగ్, తోడేలుతో రీజనింగుచేస్తున్న మేకపిల్లలాగ.

"ఎవరిజాగాలోన్రా మీ నుయ్యి వుందీ?" అన్నాడు హాన్.

ఓల్డ్ చాంగ్ మళ్ళీ ఏదో చెప్పబోయే అంతలో— జపాన్ ఆఫీసరు మోరిటా, కొరడాతో యమకింకరుడిలాగ అక్కడ ప్రత్యక్షమయేడు. జనంకేసి తిరిగి, ఒక్కసారి ఝళిపించేడు కొరడాని. గుండుదెబ్బకి పిట్టలు పారిపోయినట్టు జనం బెదిరిపోయి, పారిపోయేరు. ఆ మర్నాడే ఓల్డ్‌చాంగ్‌ని బలవంతంగా లేబర్‌కేంపుకి లాక్కుపోయేరు. ఆ వెళ్ళినవాడు మరి తిరిగిరాలేదు. అతను ఏమయేడో ఎవరికీ తెలియదు

సరి. దాంతో జనం తవ్వుకున్న నుయ్యికాస్తా హానుబాబు హక్కుభుక్తమైపోయింది. అయితే ప్రతినెలా మూడునాలుగు రోజుల పాటు కాణీకూలి అడక్కుండా హాన్ ఇంట్లో

* ఇతని పూర్తి పేరు లీ చింగ్-షాన్. హాన్‌గారి అంగరక్షకుడు.

పెట్టివాకిరీ చేసినవాళ్ళకి మాత్రం ఆ నూతినీళ్ళ తోడుకొనే అవకాశం వుంది. ఇదీ బాగానే వుంది; పనికి పనీ జరిగిపోతోంది, డబ్బులకి డబ్బులూ మిగుల్తున్నాయి. (హాన్‌కి)

మాంచిపోతుల్లాగ బలిసిన గుర్రాలు ఇరవైదాకా వున్నాయి హాన్‌కి. వాటికోసం ఒక సాలకూడా కట్టించేడతను. "ఏటి కేతం బెట్టి ఎయిపుల్లు" పండిస్తావు నువ్వు. ఇవాళో రేపో కోతలు. సరిగ్గా అలాంటి సమయంలో నీపొలంమీద పడతాయి బిగత గారి గుర్రాలు. పంటంతా సర్వనాశనం చేసేస్తాయి. నీ గుండె వెయ్యి ముక్కలై పోతుంది. నీ మెదడు మొద్దుబారి పోతుంది. కాని నోరువిప్పి 'ఇది ధరమం వా, బాబూ?'అని నువ్వు అడగలేవు. ఒకటి రెండుసార్లు ఇలా జరిగేక ఏంచేస్తావునువ్వు? 'నా ఖర్మం'అనీసుకొని పొలాన్ని వూరికే వుంచేస్తావు.

యువాన్ మావో గ్రామంలో రైతులుకూడా అంతే చేసేరు.

"ఏఁవిరా, అబ్బీ! ఏఁవిఁటి సంగతి? అలా వొదిలీసేవేఁవిటి. నీ పొలాన్ని? డబ్బుకేఁవయినా ఇబ్బందిగా వుందా?" అంటూ వస్తాడు హాన్. నీకు నోరు విడదు. పెదవి మెదలదు. ఏంచెప్పాలో ఎలా చెప్పాలో తెలియదు. వెంటనే అందుకొంటాడు హాన్.

"చూడూ, నీకుండే ఇబ్బందులు నీకూ వుంటాయి. ఒకవేళ నీకు చేసుకోడం కష్టంగా వుంటే నాకు చెప్పు. ఓ రెండు మూడేళ్ళు పోనీ నేనైనా చేసుకొంటాను" అంటాడు. అని నీ పొలం తీసుకొంటాడు. దున్నించుకొని పండించుకొంటాడు. రెండు మూడేళ్లుపోయేక అనుకొన్న ప్రకారం 'నా పొలం నాకిచ్చీ'మంటావు నువ్వు. 'అది నీ పొలఁవేనని దాఖలాలూ దస్తావేజులూ చూపించ'మంటాడు హాను- నీ దగ్గిర అలాటివేవీ లేవు, లేవని హాన్‌కి తెలుసు. ఈ లోపునే నీ పొలాన్ని తన పేరు మీద రాయించేసుకొంటాడు, నువ్వంటే చదువు సంధ్యలు లేనివాడివి; మాయా మర్మం తెలియవు. పోనీ సాయం చెయ్యడానికికూడా నీకు ఎవరూలేరు కాని హాన్ కేం? జిత్తులమారి బుర్ర వుంది; పులి పంజాలాంటి పంజావుంది. వీటికితోడు అతని అన్న జపాన్ పోలీసుల ఏజెంటు. చెయ్యవలసిన పనులన్నీ తమ్ముడికి చేసిపెడుతూ వుంటాడతను.

ఈ రకంగా— వున్న ఎకరఁవో, అరెకరఁవో కూడా పోగొట్టుకొనేవారు పేద రైతులు. హాన్‌గారి 'సామ్రాజ్యం'అలా విస్తరిల్లుతూనేవుంది. ఊరికి తూర్పు దిక్కున కొండలదాకా పొలాలన్నీ అతనివే. పడమరదిక్కున జపాన్‌వాళ్లభూముల"దాకావున్న నేలంతా అతనిదే. బాగుపడేవాడికి భగవంతుడుకూడా సాయంచేస్తాడన్నట్టు జపాన్‌వాళ్లు కూడా హాన్‌కి చాలా ఉపకారాలు చేసిపెట్టేరు.

'ఓల్డ్‌సంగ్'అని చెప్పి ఒక బక్కరైతు వుండేవాడు. అతను జపాన్ వాళ్లదగ్గిర ఓ మూడెకరాల పోరంబోకుని బాగుచేసి సాగు చేసుకోడానికి అనుమతి సంపాదించి, చెమటోడ్చి పంట పండించేడు. గింజలు చేతికందుతాయనుకున్న సమయంలో— ఓ జపాన్ అధికారితో కలిసి అక్కడికి వచ్చేడు హాన్‌గారి పుత్రిరత్నం. అతనికి జపాన్ భాష మాటాడ్డం వచ్చును. ఆ పొలం చూపిస్తూ ఏదో మాటాడుకొన్నారు వాళ్ళిద్దరూ. ఓల్డ్‌సంగ్‌కి ఒక్క ముక్క కూడా బోధపడలేదు.

వాళ్ళదగ్గిరికి వెళ్ళి, భయపడుతూనే చిన్న నవ్వొకటినవ్వి "ఏటి బాబూ? ఇలా గొచ్చేరేటి?"అన్నాడతను.

పొగరుగా తల ఆడించేడు హన్‌గారి అబ్బాయి. "ఈ జాగాలో పొలాలన్నీ మేం తీసేసుకుంటున్నాం"అన్నాడు కుండబద్దలు కొట్టినట్టు.

"పంట కోత కొచ్చిందిగదా, తఁవరు అలా సెలవిస్తే ఇప్పుడు నాగతేంగాను?" అన్నాడు ఓల్డ్‌సంగ్.

"ఏదో సరదాకి దురదకొద్దీ పండించేననుకోరా, పోరా పో :"అంటూ ఆ జపాన్ ఆఫీసరుతో కలిసి వెళ్ళిపోయేడతను.

కుప్పలా కూలిపోయేడా బక్కరైతు. ఆ మర్నాడే హాన్ మనుషులొచ్చి దౌర్జన్యంగా అతని పొలాన్ని స్వాధీనం చేసుకొన్నారు. తరవాత పాపం పన్నులుకట్టడానికి కూడా డబ్బులేక ఆ ముసలిరైతు వున్న ఒక్క గుర్రాన్నీ అమ్ముకోవలసి వచ్చింది.

సాయంత్రమయింది. తోటలో పని పూర్తిచేసేరు. వాంగూ, చావో. రాత్రి ఇంట్లో వంటకి కావలసిన బఠాణీలూ, దోసకాయలూ గట్రా కోసుకొని ఇంటి ముఖం పట్టేరిద్దరూ. మూడోవాడికి వినబడకుండా మాట్లాడుకుంటూ పొలాలగట్లంట నడుస్తున్నారు వాళ్లు.

"ఆడుసేసిన ఎదవపనులు సెప్పుకుంటూ కూసుంటే తెల్లారిపోద్దిగాని కబుర్లకి అంతుండదు"అన్నాడు చావో గొంతు తగ్గించి. "ఈ రాత్రికిరాత్రే ఎవడికేన బూమ్మీన నూకలు సెల్లించాలనుకుంటే ఆ జపానోడికి, కబురెడతాడు హాను బాబు. ఆ బాబు

* ఆ గ్రామం జపాన్‌వాళ్ళ అధీనంలో వున్నప్పుడు వూళ్ళోని పోరంబోకులన్నీ స్వాధీనం చేసుకొని వాటిని మళ్ళీ సాగుచేయించేరు.

• 'మోరిటాతారో'కి

మిగతా యవహారం సూసుకుంటాడు. అలాగ నెక్కా పత్రింనేకండ యెందరు సచ్చి పోనారో ఈ వూళ్లో! ఆ రోజుల్లొ హానుబాబు దరవాజ అంటే యఁవలోకానికి దర వాజేనన్నమాట. అది దాటి లోనకి అడుగెట్టినోడెవుడూ పేణాల్తో బెయిటికిరానేదంటే నమ్ము బాబూ! ... నువ్వు రోడ్డుమీన ఎల్తావుంటె హాను బాబు యెదురొచ్చినాడనుకో. ఎంటనే. నువ్వు తప్పుకోని ఏ పక్కసందులోకో గొందులోకో దూరిపోవాల. అలా ఎల్లడానికి నీకు కుదర్నేదనుకో; అక్కడే ఆగిపోయి ఆ బాబుని ఎల్లనిచ్చి. నువ్వెల్లాల. బాబుకి నువ్వు నమస్కారం పెడతావు. పురుగుని సూసినట్టు సూస్తాడు నిన్ను బాబు! ఒల్లంతా సిగ్గుతో సచ్చిపోవాల! ఆఁ. వొచ్చేసినాం ఇంటికి!"

"నువ్వు ముందెల్లు బాబూ! ముందు నువ్వు" అంటూ వాంగ్ వెళ్ళేక తనూ ఇంట్లోకి వెళ్ళేడు చావో.

రాత్రి భోజనానికి బఠాణీగింజలు వుడికించి, పచ్చి దోసకాయ ముక్కలు వూరేసింది చావో భార్య.

"ఏసుకో బాబూ, మరి కసిన్ని ఏసుకో!" అంటూ అతనికి వడ్డించేడు చావో. మంచి రుచిగా వున్నాయేమో, వాంగ్‌కికూడా బాగా నచ్చేయి బఠాణీలు. మొహమాటం లేకుండా తిన్నాడు.

"ఈయేడు అంత పరవానేదుగాని వాంగ్‌బాబూ, నిరుడు సూడాల మా బాధలు!" అన్నాడు చావో. "సరీగ్గ సమయానికి ఆపద్బంధువుల్లాగ ఆ కమ్యూనిస్టులు వొచ్చినారుగాని. ఆళ్లే కసింత ఆలీసెంగ వొచ్చుంటె అందరం తిండిలేక మల మల మాడి సచ్చిపోదుఁవు" అన్నాడు ఆ రోజులు జ్ఞాపకం తెచ్చుకొంటూ.

భోజనం అయేక వెళతానని లేచేడు వాంగ్. అతని ముఖం ఏదో అనిర్వచనీయమైన ఆనందంతో వెలుగుతోంది.

"కసింత దూరం నానుకూడా వొస్తాను. పద బాబూ!" అంటూ అతని వెనకే వెళ్ళేడు చావో.

నడుస్తూనే చావోకి ఎన్నోవిషయాలు చెప్పేడు వాంగ్. బీదాళిక్కీ ఏకమయి ఎదురునిలిచిన నాడు ఈ బగతలు చెయ్యగలిగిందేమీ వుండదని చెప్పేడు నిరుపేదల విముక్తికి- పోరాటం- తప్ప మరోమార్గం ఎందుకులేదో వివరంగా చెప్పేడు.

అంతా చెప్పేక "అయితేమరి ఈవూళ్లో ముందుగా మనం పనిపట్టవల్సిన బగత ఎవడు?" అని అడిగేడు.

"మరెవుడు?" అంటూ పళ్లు ఇకిలించేడు చావో. ఎందుచేతనో 'వాడి' పేరు చెప్పలేదతను.

"సరే. వాడితో పోరాడ్డానికి నువ్వు సిద్ధమేనా? మాతో నువ్వు కలుస్తావా?"

"'సిద్ధంవేనా'అని మెల్లిగా అడుగుతావా? ఆకాసంమీంచి బగవంతుదే దిగొచ్చి నన్ను ఆపినా నాను ఆగను. నాను దేనికైనా సిద్ధంవే!" అన్నాడతను ఉత్సాహంగా.

అతని చెయ్యిపట్టుకొని ఆప్యాయంగా నొక్కేడు వాంగ్. "సంతోషం! చాలా సంతోషం!! 'ధైర్యే సాహసే లక్ష్మి'అన్నారు. సరే నే వెళతాను. మిగతా విషయాలు రేపు మనం మళ్ళీ మాటాడుకుందాం. నేను చెప్పిన భోగట్టాలు నీకుతెలిసినవాళ్లెవరితో నన్నా కదిపిచూడు. వస్తాను మరి"అంటూ వెళ్ళిపోయేడు వాంగ్.

చావో ఇంటికి తిరిగొచ్చేసరికి అతనిభార్య కంచాలూ గిన్నెలూ తోముతోంది. కొడుకు కాంగుమీద కూర్చొని ఆడుకొంటున్నాడు. తండ్రిని చూడగానే వాడు కిందకి గెంతి ఎత్తుకోమన్నట్లు చేతులెత్తి నిల్చొన్నాడు. ఎలాతెలిసిందో వాడికీ తెలిసిపోయింది— 'అయ్య ఇయాళ మంచి సర్దాగా వున్నాడు. పొద్దున్నొచ్చిన దాబు సాలా మంచోడు. ఆ దాబొచ్చిన కాణ్ణించి అయ్య కోపం గీపం యెగిరిపోనాయి. ఇయాళ నన్ను ఒక్క దెబ్బకూడా కొట్టనేదు ...'అనుకొన్నాడు వాడు. అయ్యకి వాడు చెప్పవలిసిన భోగట్టాలు చాలా వున్నాయి. అందుకే గెడ్డం పట్టుకొని తనవేపు తిప్పుకొని హుషారుగా తండ్రికి చెప్పసాగేడు.... వాడివాళ ఓ మిడతని పట్టుకున్నాట్ట. రేపు మరోటి పట్టుకుంటాట్ట. మరేమో ఖివాళ నదిలో బోలెడు చేపల్ని చూసేట్ట. అల్లా ఇంటాయన చేపలు పట్టు కుందామని వల వేస్తే ఎవరో దొంగవెధవలు దాన్ని లాగిపారేసేరుట. మరొకాయన వలవేస్తేనేమో, బుట్టతో బుట్టెడు చేపలు పడ్డాయిట. రొంజిరాలు, నెత్తళ్లు ఒకటేమిటి చాలా పడ్డాయిట.......

"నాన్నా, మనంకూడ రేపెల్లి సేపలుపడదాంవా?" అని అడిగేడు ఆఖరికి.

"అలాగే ఎల్దాం. గాని మరి నువ్వు రేపు మిడతల్ని ఒట్టుకుంటానన్నావు?" ఎదురుప్రశ్న వేసేడు తండ్రి.

తండ్రి ప్రశ్నకి వాడు సమాధానం చెప్పేవాడేమో. కాని వాడికప్పటికే కళ్లు మూతలు పడిపోతున్నాయి. తండ్రి గుండెలమీద అలాగే వాలి నిద్రిపోయేడు. కుర్రాణ్ణి ఎత్తుకొని నెమ్మదిగా కాంగుమీద పడుకోబెట్టి వాడి వొంటిమీద ఓ చింకిబొంత కప్పేడు చావో. ఈలోపుని పనులు పూర్తిచేసుకొని అతని భార్య అక్కడికి వచ్చింది.

"పొయ్యిలోకి కర్రిలు ఐపోనాయి" అందామె భర్తని వుద్దేశించి. ఆ పెనిమిటితో కలిగిననాడు తిని, లేనినాడు పస్తులేవుండి— పడరాని పాట్లు పడిందామె. కాని ఒక్కనాడైనా పల్లెత్తుమాట ఒకర్ని అనలేదు: ఒకరిచేత పడలేదు.

"సరే, ఆనకసూద్దాం. రేపు తెల్లారి బోలెడు పనులున్నాయి నాకు. అందాకా ఎదో కర్రాకంపాతోటి కాలచ్ఛేపం సేసీమరి" అన్నాడు చావో. అని గుడిసెలోంచిబైటికి వచ్చి చుట్ట ముట్టించేడు. కొడుకుపక్కనే సర్దుకు పడుక్కొంది అతని భార్య. బాగా అలిసిపోయివుందేమో, మరి కొంతసేపటికే ఆమెకు గాఢంగా నిద్రి పట్టేసింది.

కొంతసేపుపోయేక మళ్లీ ఇంట్లోకివచ్చేడు చావో. గోడకి ఆనుకొని ఆలోచిస్తూ కూర్చున్నాడు. తన బతుకులో ఆరని చిచ్చు రగిల్చిన హాన్‌గురించే అతనిఆలోచనంతా.

మూడేళ్ళకిందట— లేబర్ కేంపుకి మనుషుల్ని తోలుకుపోతున్నారని తెలిసి తప్పించుకుందామని దూరంగా పారిపోయి ఓ చెట్టుతొర్రిలో దాక్కున్నాడు చావో. కాని లాభంలేకపోయింది, హాన్‌కి ఈ సంగతి ఎలా తెలిసిందో తెలిసిపోయింది. జపాన్ ఆఫీసరు మోరిటాతో యీ సంగతి చెప్పేడు. వాడు వచ్చి వెతికి మరీ పట్టుకొని జైల్లో తోసేసేడు. మూణ్ణెల్లు జైల్లో మగ్గిన తరవాత లేబర్ కేంపుకి పంపించేసేరు. ఇది మూడేళ్ళనాటి మాట. మరి నిరుడో?.... శిస్తులు కట్టడం మూడు రోజులు ఆలస్యమయిందని చెప్పి, చావోచేత గాజుపెంకులమీద మోకాళ్లు వేయించేడు హాను. అతని మణుకులు చెక్కుకుపోయి, రక్తం ధారలుగా కారిపోయింది. నేలంతా నెత్తురుమయం అయిపోయింది. గుండెల్లో గునపంతో పొడిచినట్టనిపించింది చావోకి.

....ఈ లంజకొడుకు పనిపట్టించడానికి ఇప్పుడు ఆ బాబులు వచ్చేరు — అలా అనుకోగానే అతనికి వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టనిపించింది. కాంగుమీద నడుం వాల్చి మంచి హుషారుగా చుట్ట తాగసాగేడు.

'....గానీ, ఆణ్ణి నిజంగా అణిసీగలంవా? వాంగు బాబు సెప్పినంత సుళువుగా హానుగాడి పీడ ఇరగడవుద్దా?'— ఒక్కసారి అలా అనిపించగానే అతనికి కొంచెం నీరసం వచ్చినట్టనిపించింది. పక్కమీద అటూ ఇటూ తెగదొర్లేడు. నిద్రపట్టడంలేదు. చుట్ట ఆరిపోయింది. లేచి పొయ్యిలో నిప్పుతీసుకొని మళ్ళీ ముట్టించేడు. అక్కడే అలా కూర్చుండిపోయేడతను. గదిలో అడ్డ దిడ్డంగా అలుముకొంటున్న పొగలాగే అతని ఆలోచనలూ చెదిరిపోతున్నాయి.... హానంటే సామాన్యుడు కాడు, పెద్ద పెద్ద వాళ్ళదగ్గిర బోలెడు పలుకుబడివుంది వాడికి. వాడి అన్న అదేదోవూళ్లో రహస్యంగా

వుంటున్నాదంటారు. వాడితమ్ముడు కొండల్లో బందిపోటు దొంగలకి తరిఫీదు యిస్తు న్నాడు. వాడి కొడుకు కొమింటాంగ్ సైన్యంతో కత్తుకలిపేడు. ఇకపోతే ఈవూళ్లోనే వాడికి చుట్టాలూ, స్నేహితులూ, హంగుదారులూ కావలసినంతమంది వున్నారు.

'అణ్ణీ మనఁవేం సెయ్యలేఁవేఁవో ?'– అనుకొన్నాడతను.

వెంటనే వాంగు నవ్వుముఖం కనిపించింది. "అన్నా, నువ్వు భయపడు తున్నావా ?" అన్నట్టనిపించింది.

'నానెందుకు బయ్యంపడాల ?'అనుకొన్నాడు చావో. 'నేను భయపడుతున్నాను' అనుకొనేసరికి అతనికి తనమీద తనకే విపరీతమైన అసహ్యం వేసింది. వాంగ్‌చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకొన్నాడు.

వాంగు బాబులాటి సిన్నోళ్ళకే బయ్యం లేనప్పుడు నానెందుకు బయ్యంపడాల ? మనకి సాయం సెయ్యనానికి నచ్చాపనచ్చాలు సిపాయీలు గోడకవతల* వున్నారనిసెప్పి నాడా బాబు. సెపంచకంలోవున్న పేదోల్లందరికీ ఒకటే ఇంటి పేరు: అదేటంటే– పేదోడు– అని వుండాలన్నాడు. సెపంచకంలో పేదోల్లే ఎక్కువమందున్నారు. రేపే నాలాంటోళ్ళని మరికొంతమందిని కలుపుకొస్తాను. సూద్దాం. హానుబాబే నెగ్గుతాడో, మాఁవే నెగ్గుతావో ?'– అలా అనుకోగానే హనేవచ్చి తన ఎదుట నిలిచి, ఆ గాజు కళ్ళతో కోపంగా చూస్తున్నట్టనిపించింది చావోకి. "సావు లంజికొడకా! నువ్వొస్తేనే మాకు సుకఁవూ, సాంతీ, నవ్వు"అంటూ చేతితో చుట్టని పొయ్యిలోకి విసిరి కొట్టేడు.

"తొంగోరాదా? తెల్లారిపొతన్నాది !"అంది చావో భార్య. చావోలేచి లోపలికి వెళ్లేడు. అప్పుడే తొలికోడి కూసింది. మూడోజాముకల్లా మళ్ళీ లేచిపోయేడు చావో. వాంగ్‌ని కలుసుకోడానికి బయల్దేరేడు.

స్కూల్లో ఓ డెస్కుమీద పడుక్కొని వున్నాడు వాంగ్. అప్పుడే నిద్ర లేచి నట్టున్నాడు. కళ్లు నులుముకొంటూ చావోని చూసేడు. డెస్కుదిగి అతనితోకలిసి అలా బైటికి వెళ్ళేడు.

రాత్రి తనకి వచ్చిన ఆలోచనలన్నీ చెప్పేడు చావో. అన్నీ చెప్పేక చివరికి "పోరాడాల బాబూ ! పోరులో నాను సావుకైన సిద్దఁవే !"అన్నాడు.

"విప్లవం వర్ధిల్లాలి !"అన్నాడు వాంగ్ నవ్వుతూ

"అవును బాబూ విప్లవం వర్ధిల్లాలి ! 'ధైర్యే సాహసే లక్ష్మీ'అన్నారు" అన్నాడు చావో.

తరవాత ఇద్దరూ కలిసి మరికొంతమందిని కలవడానికి బయల్దేరేరు.

---

* Eighth Route Army, United Democratic Army 'చైనా గోడ'కి రెండువైపులా వున్నారు.

(సశేషం)

కథ :

# నూతన మానవుడు

ప్రకాశం

"ఇంక ఇరవైనాలుగు గంటలలో తనని ఉరితీస్తారు. అంటే చట్టబద్ధంగా 'హత్య' చేస్తారన్నమాట ! తను 'చట్టవ్యతిరేకం'గా హత్యచేశాడని తనని 'చట్టబద్ధంగా' హత్యచేస్తున్నారు !' నవ్వుకున్నాడు అతడు.

'చట్టం.........'

హుఁ ఎవరిని రక్షించేందుకీ చట్టం ? ఎవరు ఏర్పరచారీ చట్టాన్ని ??

తను చేసిన 'ఘోరాన్నే' ఈ చట్టం పరిశీలిస్తున్నది కాని తనచేత చంపబడ్డవాని ఘోరాలనెందుకు పరిశోధించదు ?

తను హంతకుడట. అందుకని తనకి ఉరిశిక్షట : అంటే హంతకుణ్ని హత్య చేయాలని. హింసించేవాణ్ని మట్టుపెట్టాల్సిందేనని, హింసని ప్రతిహింసతో యెదుర్కో వాలని ఈ చట్టంకూడా వొప్పుకుంటున్న దన్నమాట. మరి తను చంపినవాడు హంతకుడేనే ! వాడు ఎంత మంది అమాయకుల మాన, ప్రాణాల్ని బలిగొనలేదు. వడ్డీల పేరిట ఎన్ని కుటుంబాలని నాశనం చేయలేదు ?

చట్టం-అధికారం చేయలేనప్పుడు ఒక న్యాయమైన పనిని తనలాంటివాళ్లు చేయడం నేరమెలా అవుతుంది ? ఒక ధనవంతుడు 'ఆత్మరక్షణ' పేరిట చంపితే చట్టం అంగీకరిస్తుంది కాని కొందరు తమ వర్గశ్రేయస్సుకోసం పిడికెడు కిరాతకుల్ని తొలగిస్తే ఎందుకు అంగీకరించదు ? పోలీసులు 'శాంతిభద్రతల' పేరిట నడివీధిలో యెంత మంది నడుములు విరగ్గొట్టినా, ఎన్నివందల అమాయకుల్ని పసిపిల్లలతో సహా కాల్చి చంపినా ఈ చట్టం ఎందుకు ఆక్షేపణ చెప్పదు ?'

జైలు గదిలో ఓ మూల కూర్చుని దీర్ఘంగా ఆలోచించసాగాడు అతడు. తను ఇంకో ఇరవైనాలుగు గంటలలో చావబోతున్నాడని తెలిసినా అతనిలో ఏమాత్రం జంకు గాని, ఆరాటంగాని కనిపించడంలేదు. అదొక సర్వ సాధారణవిషయంలాగే నిర్భీతిగా ఉన్నాడు.

జైలు గోడలు పెద్దరాళ్ళతో నిర్మించబడి బందోబస్తుగా ఉన్నాయి. ఎప్పుడో బ్రిటిషువాళ్లు దేశభక్తులకోసం కట్టించారా జైలుని. దాన్నే యీ ప్రభుత్వమూ వినియో

గించుకుంటోంది. పదడుగుల ఎత్తున తలకూడా పట్టనంత చిన్నని వెంటిలేటర్ ఒకటి ఉన్నది. దానికి ఇనుపచువ్వలు, చిల్లులరేకు బిగించబడి ఉన్నాయి. అందులోంచి వచ్చే గుడ్డి వెలుతురే లేకపోతే ఆ గది పూర్తిగా అంధకారమయంగా ఉండేది.

ఆగదిలో ఏ వస్తువూలేదు. కనీసం కూర్చునేందుకుగాని, పడుకునేందుకుగాని చిన్న చాపకూడాలేదు. గదంతా దుర్వాసనవేస్తున్నది. బయటకువెళ్లే మార్గం పూడుకు పోయి ఉంటం మూలాన ఒకమూల ఉచ్చ పేరుకునివుంది. గదంతా అసహ్యం వేసే మరకలు. అక్కడక్కడా రక్తం మరకలుకూడా ఉన్నాయి. ఆ గదిలోకూడా "శాంతి భద్రతలరక్షణ"కోసం లాఠీచార్జీలు, పోలీసు కాల్పులు జరిగాయట. కొందరు "దుండ గులు" అక్కడికక్కడే మరణించారట. అందులో బంధించబడేవాళ్లు పులులకంటే, సింహాలకంటే ప్రమాదకరమైన వాళ్ళనో లేక తమలాటి మనుషులు కారనో– వాళ్ళని ఒకటికి–రెంటికీకూడా బయటకు పంపించరు.

ఆ గదిలోకొచ్చిన అయిదారు రోజులూ భరించలేకపోయాడు అతడు. కాని గత్యంతరం లేకపోవటం వల్ల అదే అలవాటైపోయింది. "అందులో బంధించబడే వాళ్ళందరూ తనలాంటి వాళ్లే. హిపీ్ప నాగరికతకు దాసులుకాని తెలివైన విద్యార్థులు, రైతులు, కార్మికులు! తను ఉన్నప్పటినుంచేకాదు, అసలా జైలు నిర్మించినప్పటినించీ అందులోకి తమలాటివాళ్ళే వచ్చారు కాని- ఎన్నడు ఒక్క భూస్వామికాని వడ్డీవ్యాపారి కాని రాలేదు!

"ఆ రోజు....

తను, తన సహచరులు కలసి ఒక 'రాక్షస సంహారానికి' బయలుదేరేరు.

అర్థరాత్రి. వెన్నెల లేదు. ఆ ఊళ్లో కరంటున్నా వీధిలైట్లు లేవు. ఆ 'నరకా సురుడి'ఇల్లు ఓ 'దుర్గం'లా వున్నది. ఆ గ్రామంలో నాలుగయిదు పెంకుటిండ్లు తప్ప అన్నీ పూరిగుడిసెలే! అంత బీదరైతులమధ్య లక్షాధికారి! వాడి భవంతికి ఉపయో గించిన సొమ్ములో ఆ గ్రామంలోని గుడిసెలన్నింటినీ పెంకుటిండ్లుగా మార్చొచ్చు.

ఆ భవంతిచుట్టూ ఏడడుగుల ఎత్తయిన ప్రహరీగోడ. గోడమీద వాడైన గాజు పెంకులు. 'నదీనదాలు అడవులు కొండలు ఎడారులే అడ్డం కానప్పుడు ఈ గాజు పెం కులు, అల్సేషన్‌కుక్కలు, గూర్ఖాలు ఒక లెక్క?

నరకాసురవధ అనంతరం........

"రేపు ఈ గ్రామంలోని కష్టజీవులంతా 'కొత్తదీపావళి'పండుగ జరుపుకుంటారు" అన్నాడు తమలో ఒకరు.

"అవును పాత నరకాసురుడి సంగతేమోగాని, యీ నయా నరకాసురిడి కిరాత కాలు. హింసలు ప్రత్యక్షంగా అనుభవించారు కాబట్టి పండగ గొప్పగా చేసుకుంటారు" తను.

ఆ రోజు తను, తన మిత్రుడు కలసి ఆ 'మధ్యతరగతి'కి చెందిన వాడింట్లో షెల్టర్ తీసుకోక పోవలసింది. మధ్యతరగతి ప్రజల్లో ఎక్కువ మందిది 'గోడమీది పిల్లి' మనస్తత్వం. వారిలో ఎక్కువమంది 'మాటగాళ్లేగాని' 'చేతగాళ్లు'కారు.

తన మిత్రుడు ఎలా గ్రహించేడో అతినైపుణ్యంగా తప్పించుకున్నాడు. తనొక్కడే పట్టుబడింది. చాలావరకు తన అజాగ్రత్తే కారణం.

* * *

తలుపుల చప్పుడయింది.

ఇద్దరు పోలీసులు లోపలకు వచ్చారు. వస్తూనే వాళ్లు జేబు రుమాళ్ళని అడ్డం పెట్టుకున్నారు ముక్కుకు. వాసన భరించలేక.

ఒక పోలీసు చేతిలో అల్యూమినియం చిప్ప నిండా అన్నము నీళ్ళలోటా మరో పోలీసుచేతిలో లాఠీకర్ర. భుజాన తుపాకి ఉన్నాయి.

"ఇగో బువ్వ" అంటూ అల్యూమినియం చిప్పని, నీళ్ళ లోటాని క్రిందపెట్టాడు ఒకటో పోలీసు.

"అక్కరలేదు. నాకిప్పుడేం ఆకలిగాలేదు తీసుకెళ్ళండి."—అతను.

"మల్ల మల్ల తినబోతవా? 'ఆఖరు'తిండి తిను తిను" రెండోపోలీసు హేళనగా.

"ఎందుకులే, నాలుగు కాలాలు బతకవలసినవాడివి నలుగుర్ని పీడించవలసిన వాడివి నువ్వే తిను—"

"అహః ఉరిశిచ్చేసినా రెంపర విగినట్టులేదే!"

అన్నం పట్టుకొచ్చిన పోలీసు ఎందుకో అతనివైపు జాలిగా చూడసాగాడు.

"బి యస్సీ సదివినవట, గీకర్మేందిబాబు నీకు? దేశంల ఎవడెట్లబోతె నీకేంది! ఎవనిబతుకు వాడు సూస్కోవాలె. అయ్య బాంచెను అంటె ఏ దొరన్న నీకు ఉద్యోగ మియ్యకపోయిండా. సూడు ఇప్పుడు మీ తల్లిదండ్రులు ఎట్ల తల్లడిల్లుతాండ్లో పాపం!

"అరె టు నాట్ ఫోర్ ఏం మాటలాడ్తి వాన్తో? నడు నడు తింటె తిన్నడు లేక పోతె లేదు మనకేంది. పా."— నిర్లక్ష్యం.

అతనీ అమర్యాదని సహించలేకపోయాడు.

"ఏయ్, మర్యాదగా మాట్లాడు. వాడు వీడు అంటావేం?"

"బరాబరంట! ఏంది? నువ్వేమన్న ఎస్సైసాబ్‌వా ఎస్పీసాబ్‌వా? ఒహో్వ. అగొ ఏంబాగ సూస్తానవ్ తంతవా?"

"తంతానా దవడపళ్లు రాలగొడ్తానా నువ్వెవడివిరా నన్ను వాడు వీడు అనడానికి?" అతను లేచాడు.

"ఏదీ తన్ను. తన్ను సూస్త" భుజంమీది రైఫిల్‌ని చేతిలోకి తీసుకున్నాడు పోలీసు.

"ఏం తుపాకి చూపిస్తే బెదురుతా ననుకున్నావా?" అంటూ బయ్‌నెట్ పట్టుకుని మదమతో అతని ఛాతీమీద బలంగా నెట్టాడు.

స్లిప్ అయి మూలన వెల్లకిలా పడిపోయాడు పోలీసు. నిక్కరు వెనక భాగం తడిసింది. అతని రెండుచేతులూ అసహ్యమైపోయాయి.

బూతులు కూస్తూ లేచాడు.

మొదటి పోలీసు ఇద్దరిమధ్యకు వచ్చి సముదాయించసాగాడు.

అంతలో ఈ గొడవవిని ఏడెనిమిదిమంది సాయుధభటులు, జైలు సూపరింటెండెంట్ పరుగెత్తుకొచ్చారు హడావిడిగా.

"ఏమిటి? ఏంజరిగింది? వాట్ హాప్పెన్?"—సూపరింటెండెంట్.

నిక్కరు తడిసిన పోలీసు అటెన్షన్ పొజిషన్లోకొచ్చి—

"చూడండి సార్ పాపమని మీల్స్ ఇయ్యడానికొస్తె మమ్మల్నితన్ని తప్పించుకు పారిపోవాల్నని చూసిండు."

"ఏం మిస్టర్ ఏం సంగతి?"

"ఏమీ లేదు. నేనేమీ తప్పించుకుపోవాలని చూడలేదు. మీ కానిస్టేబుల్స్‌కి కొంచెం మానర్స్.... మర్యాదగా మాట్లాడడం నేర్పండి."

"ఓ యూ వాంట్ రెస్‌పెక్ట్. వైనాట్ సర్. ఇంకో ఇరవై గంటలాగండి తమకి కావల్సినంత మర్యాద లభిస్తుంది." వ్యంగ్యంగా అని పోలీసుల్తో 'బి కేర్ ఫుల్' అని హెచ్చరించి వెళ్ళిపోయాడు జైలు సూపరింటెండెంట్.

"బతికి పోయినవ్ బిడ్డా. కొద్దిగయితె మన తడాఖా సూస్తుంటివి. ఎట్లైన సచ్చ

టోనివని ఇద్కిపెడ్తాన పో." వీరాధి వీరునిలా అభినయయుక్తంగా అంటూ బయటకు నడిచాను నెక్కరుతడిసిన పోలీసు.

మొదటి పోలీసు తనవైపు 'ఊరుకో ఏమీ అనకు'అన్నట్టు సౌంజ్ఞచేస్తూ'అన్నం తినమని' గిన్నెవైపుచూపిస్తూ వెళ్లాడు. అతనికి తనంటే సానుభూతి ఉన్నట్టనిపిస్తోంది.

ఆనాడు తనని బంధించిన వాళ్ళలోకూడా ఒక పోలీసు తనంటే యెంతో అభిమానం చూపించాడు.

దాదాపు ముప్పైమంది సాయుధ రిజర్వు దళం మధ్య తనొక్కడు నిరాయుధంగా;

పోలీస్ వాన్ ఊరవతల ఆగింది.

అక్కడ జనసంచారంలేదు. దూరంగా దట్టంగా చెట్లు. అడవి ఆ చోటునించే ప్రారంభం.

తన చేతులు వెనక్కి విరిచి కట్టబడి ఉన్నాయి. వాన్ నుంచి దింపారు తనని. తుపాకులు సరిచేసుకుంటూ పోలీసులూ దిగారు.

తనని ఎక్కడికి తీసుకు వెళుతున్నారో, ఎందుకు తీసుకు వెళ్తున్నారో అర్థం అయింది. గుండె ఒక్కసారి భగ్గుమని మండింది. పిడికిళ్లు బిగుసుకు పోయినయ్. కాని తను అసహాయ స్థితిలో ఉన్నాడు.

కోర్టుచుట్టూ తిరగడం పెద్దరిస్కు అనో. 'సంఘర్షణ'అంటే ఏవైనా ప్రమోషన్లు దొరుకుతాయనో— మరెందుకో తెలియదు.

ఎవరూలేకుండా చప్పున పని పూర్తిచేసుకుందామనుకున్నారు. అంతలో అక్కడ సంచరించే గిరిజనులు కొందరు ఒక్కొక్కరే గుమికూడారు. చూస్తుండగానే పెద్ద గుంపు తయారైంది.

వాళ్లు కనపడగానే ఎందుకో జంకారు పోలీసులు. ఒకడు వాళ్లని చెదరగొట్టమని హుకుం జారీచేశాడు. పదిపన్నెండు ఉక్కుటోపీలు లాఠీలతో ఆ జనాన్ని బెదరగొట్టడానికి ప్రయత్నించాయి. కాని యీ టోపీలు పరుగెత్తినంతసేపు దూరం ఉరికి వీళ్లు వెనుదిరగానే వాళ్లూ వీళ్ళవెనకే తిరిగిరాసాగారు. మరికొందరు పొదలచాటునుంచి, చెట్లెక్కి 'సాయుధ సంఘర్షణ' ఎలా ఉంటుందోనని చూడసాగారు.

ఉక్కుటోపీలు అలసిపొయ్యాయి.

తనకెందుకో అప్పుడు వాళ్ళని రెచ్చగొట్టాలనిపించింది—

"ఆఫ్టరాల్ యీ గిరిజనులకు భయపడతారెందుకు? వీళ్లవల్ల మీకేం హాని జరుగుతుందని— ఊ మీపని కానివ్వండి. మన దేశంలో ప్రజాపత్రికలేమీ లేవు అన్నీ గవర్నమెంట్ పత్రికలే. యదార్థం తెలుసుకునేందుకు ఏ పత్రికా విలేఖరీ ఏ ప్రతిపక్ష నాయకుడూ యిక్కడికిరాడు. మీరెట్లా రిపోర్టిస్తే అట్లా పత్రికల్లో పతాకశీర్షికల్తో వార్తలొస్తాయి. ఊ కానివ్వండి మీకు అడ్డేమిటి ఈ ప్రభుత్వం ఉన్నంతకాలం...."

తనలోని కసి, ఆవేశం, క్రోధం అన్నీ అలా మాటలరూపంలో వెలువడ్డాయి.

పోలీసులంతా తనవైపు తిరిగారు.

ఒక హెడ్డు కోపంగా తన దగ్గరకొచ్చి లాఠీతో పదేల్మని తన కాళ్ళమీద కొట్టాడు. "క్యాబె హర్రాంకె. క్యా నఖరాకర్తె? ఖైమఖైమ మార్‌దూంగా సమ్‌ఝె?"

వాడి ముక్కుపచ్చడయ్యేలా గుద్దాలనిపించింది, తనకా క్షణంలో. తను ఎటూ కదలలేనంతగా బంధించబడి ఉన్నాడు. నిస్సహాయస్థితిలో ఉన్నవారిమీద యెంత ప్రతాపం చూపిస్తారు వీళ్లు!

"బాబు ఆవేశపడకు ఈ టైంలో నువ్వు ఏం మాట్లాడకపోవడం మంచిది" తన పక్కనున్న పోలీసు రహస్యంగా అన్నాడు.

తను ఆశ్చర్యంగా అతనివైపు చూశాడు. అతను సీరియస్‌గానే అంటున్నాడు. అతని మొఖంలో సానుభూతి ద్యోతకమవుతుంది.

"బహుశ నిన్ను యిప్పుడు ఏమీ చెయ్యలేరనుకుంటాను. కాని నువ్వుమాత్రం నోరుజారకు. గొడ్డును బాదినట్టు ఘోరంగా బాదుతారుబాబూ." నెమ్మదిగా తిరిగిఅన్నాడు.

మరికాసేపు ఆగి అటు ఇటూ చూసి

"నా కొడుకుకూడా ఇలాగే మీలో కల్సిండట బాబూ." తగ్గుస్వరంలో అన్నాడు ఆ పోలీసు.

తను అప్రతిభూతుడయ్యాడు. "అతని పేరు?"

చెప్పాడు.

ఓఫ్ ఈ రాక్షస సంహారంలో పాల్గొన్నవాడే. తనలో ఉండి తప్పించుకు పారిపోయినవాడే!

"మీరనునే రాజ్యం వొచ్చుడు కష్టం బాబు. అబ్బ ఎంత ఫౌజుఉన్నదీ దేశంల! అసలు రాక్షసుల్ని విడిచి, పోలీసుల్ని చంపి ప్రజల్ని రక్షించేవాళ్లని చంపుతున్నారు వీళ్లు!"

ఎవడో తమవైపు రావడంతో మాట్లాడితే ప్రమాదమని తల తిప్పి దూరంగా చూడసాగాడు ఆ పోలీసు.

తర్వాత తను మాట్లాడాలని ప్రయత్నించినా అతను వినిపించుకోలేదు. తర్జన భర్జనలపిదప తనని పోలీస్ స్టేషన్‌కే తీసుకెళ్లారు. అక్కడ తనస్థితి.... అది మరో మామూలైన విషాదగాధ.

టైం ఎంతవుతోందో ? ఇంకా 'ముహూర్తానికి' ఎంత సమయం మిగిలివుందో ?

* * *

తలుపుల చప్పుడయింది.

మళ్ళీ ఎందుకో అనుకున్నాడు అతను.

ఒక జవాన్ వచ్చి "రాజమ్మ నీకేమైతది ?" అనడిగాడు.

ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు అతను.

"మా అమ్మ. ఏం ఎందుకు ? మా అమ్మ వచ్చిందా ? చూడడానికి అనుమతి ఇచ్చారా ?" ఆదుర్దాగా ఆనందంగా అడిగాడు అతను.

"అవును. ఇంకో అరగంటలో ములాఖాత్," జవాన్ వెళ్ళిపోయాడు.

ఒక్కసారి గది గిర్రున తిరిగినట్లనిపించిందతనికి.

'అమ్మ.... తనను ప్రాణపదంగా పెంచి పెద్దచేసిన అమ్మ.... తను 'గొప్పవాడైతే' చూసి సంతోషించాలని రెక్కలు ముక్కలుచేసుకుని చదివించిన అమ్మ....అన్ని ఆశలూ తనమీదే పెట్టుకుని తనకోసమే జీవిస్తున్న అమ్మ.... తనకి ఉరిశిక్ష పడిందని తెలవగానే అమ్మగుండెలు ఎంతగా అవిసిపొయ్యాయో ? అమ్మ మనసెంత క్షోభపడ్డదో ఆమె మాతృహృదయం ఎంత తల్లడిల్లిందో.... ఇన్నేళ్లూ ఇన్ని కష్టాలుపడి పెంచిన అమ్మకు తను ఏమీ ఇవ్వలేకపోతున్నాడే....

అతని కళ్లు అప్రయత్నంగా చెమర్చాయి.

"ఛి ఛీ తనింత దుర్బలుడయిపోతున్నాడేమిటి ? అమ్మకు తను ద్రోహం చేశాడా ? తను కృతఘ్నుడా ? లేదు లేదు 'పావెల్' లాంటి కొడుకుని చూసుకుని.... భగత్‌సింగ్‌లాంటి కొడుకుని తలచుకుని ఏ తల్లియినా యిట్లా అనుకుంటుందా ? లేదు అట్లా యెప్పుడూ అనుకోదు. అలాటి కొడుకును చూసుకుని గర్విస్తుంది. ఆమ్మ ఆశించిన 'గొప్పతనం' డబ్బు సంపాదన కాదు.... అలా అయితే తను బందిపోటో,

దొంగవ్యాపారో, లంచగొండో అయి డబ్బు సంపాదిస్తే అమ్మ సహించేదా.... లేదు లేదు. తన అమ్మ అలాటిదికాదు. తను ప్రయోజకుడు కావాలని అమ్మ ఉద్దేశం.... తను నలుగురికి మేలుచేసేవాడు కావాలని... న్యాయస్థుడు అవాలని అమ్మ కోరిక. అమ్మ ఆశించిన దానికంటే తను మరింత ఎత్తు యెదిగాడు. తన అమ్మకు ఏ కొడుకూ ఇవ్వలేని 'వీరమాత' గౌరవాన్నిస్తున్నాడు తను ...

తలుపులు తెరచుకున్నాయి.

"ఇట్లా రా." ఇద్దరు సాయుధ జవాన్లు.

అతన్ని మరోగదిలోకి తీసుకువెళ్ళి తాళం వేశారు. ఆ గదికి ఒకవైపు గోడకి బదులు అన్నీ ఇనుపచువ్వలు ఉన్నాయి.

కొంచెం సేపట్లో ఖైదీలను చూడడానికి వచ్చేవారు ఒక్కొక్కరే రాసాగారు. అతను చువ్వల్ని రెండు చేతుల్తో పట్టుకుని ఆదుర్దాగా వెదకసాగాడు. ఒక కృష్కించి పోయిన మధ్యవయస్కురాలు పాలిపోయిన మొహంతో గబగబా వచ్చింది.

అతని నవనాడులు ఒక్కసారి ఉప్పొంగి పోయాయి. "అమ్మా...."

"నా కొడుకా.... నా తండ్రీ...." ఆ తల్లి భోరుమంటూ వచ్చి చువ్వల గుండా చేతులు పోనిచ్చి అతన్ని కౌగలించుకుంది.

ఇద్దరూ చాలాసేపటిదాకా ఏమీ మాట్లాడుకోలేకపోయారు. ఆ తల్లి అతని మొహాన్ని రెండుచేతుల్తోను తడిమింది.

"నా కొడుకా! నిన్ను నిజంగా ఉరితీస్తారా నాయనా? నిజంగానా బాబూ" గద్గదికంగా అంది.

అతను నవ్వాడు. నిట్టూర్చాడు.

"అమ్మా! ఇంత పిరికిదానవైపోతున్నావేమమ్మా? ఊరుకో. ఏడవకమ్మా.

మంచికోసం పాటుపడేవాళ్ళకి మొదట్లో ఇలాటి మరణాలు తప్పవు. అమ్మా! ఏదీ ఇటుచూడు మేము చేసింది ఏమైనా తప్పా అమ్మా?"

ఆమె కన్నీళ్లు తుడుచుకుంది.

"లేదు నాయనా లేదు. మీరు చేసింది మంచిపనే బాబూ, చాలా మంచి పని. మీలాటివాళ్లు అనాడు లేకపోవటంవల్లనే మనూరిదొర మీ తండ్రిని పొట్టనపెట్టుకునాడు. మీ పేరు చెప్పుకుని ఆ ఊరి పేదోళ్ళయినా సుఖంగా ఉంటారు...."— తల్లి.

"అంతే చాలమ్మా అంతే చాలు. వెయ్యి సంసారాలు కూలగొట్టి ఒక్కడు బతుకుతుంటే.... ఆ ఒక్కడ్ని నరికి వెయ్యి కుటుంబాలని రక్షించడం మంచిదికాదూ? మంచి కోసం చస్తే ఏమమ్మా? రోగంతోనో, ప్రమాదంలోనో చావడంకంటే యీ చావు గొప్పదికాదా అమ్మా?"

"అవును బాబు. చాలా గొప్పది." ఎదురు చెప్పలేకపోయింది తల్లి.

"నా తండ్రి భూస్వామిచేతుల్లో చచ్చాడు. నేను భూస్వామినిచంపి చస్తున్నాను. నాన్న చావువల్ల ఎవరికీ మేలు జరుగలేదు. నా చావువల్ల నలుగురికీ మేలు జర్గుతోంది. కాదంటావా అమ్మా?" అతను తల్లి కన్నీళ్ళను తుడిచాడు.

"ఎలా కాదంటాను బాబూ! నీవల్ల ఎంతో మందికి మేలు జరిగింది. మీరు అప్పు పత్రాలూ, దస్తావేజులూ తగులబెట్టారంటకదా! ఎంతో మంది బాలుగా మీకు దండాలు పెట్టుకుంటున్నారు" తల్లిలో కొంచెం శోకభారం తొలిగినట్లయింది.

"మరి నువ్వు దుఃఖిస్తావేమమ్మా గర్వించాలిగాని!"

"ఓయ్, ఏం మాటలవి, ఇక్కడ అలాటి మాటలు మాట్లాడుకోవద్దు. ఇంటి సంగతులు మాట్లాడుకోండి." వార్డర్ హెచ్చరించాడు.

"ఇప్పుడక్కడ ఏమనుకుంటున్నారమ్మా"— అతను నెమ్మదిగా.

"కలుపుమొక్కల్ని పీకేసినాదే వరిచేను బాగా పండుతుందని అనుకుంటున్నారు బాబు. దేశమంతటా కలుపుమొక్కల్ని పీకేసేపని తీవ్రం చేయాలని ఆలోచిస్తున్నారు" తల్లి.

"నిజంగా!" అతను ఒక్కసారి ఆశ్చర్యపోయాడు. తనతల్లి అంత సింబాలిక్‌గా మాట్లాడటం అతన్ని విస్మయ పరచింది. బహుశ తన సహచరుల సహవాసంవల్ల కాబోలు అనుకున్నాడు.

"అవునుబాబూ! కలుపుమొక్కలులేని చేనుని ఊహించుకుంటూ, కలలుగంటూ అందరూ సంతోషపడి పోతున్నారు."— తల్లి ఉత్సాహంగా.

"మన 'బంధువు'లెవరైనా నిన్ను కలిశారా అమ్మా?" ఆనందంగా అతను.

"ఆ కలిశారుబాబు. వాళ్లతోడు, ఓదార్పులేకుంటే నేనిట్లా ఉండేదాన్నా!"

"ఏయ్ టైమయింది. ఇకలేవండి. వెళ్లిపొండి."— వార్డర్ గట్టిగా అరిచాడు,

"నాయనా......" ఆ తల్లి హృదయం తిరిగి ఒక్కసారి ద్రవించిపోయింది దుఃఖంతో.

"నా కొడుకా .. ఇకనువ్వు మళ్లీనాకు కనిపించవాతండ్రీ. నిన్ను నిజంగా ఉరి కంబం ఎక్కిస్తారాబాబు,"— ఆమె కంఠం శోకంతో పూడుకుపోయింది.

"అమ్మా! అదేమిటి. మళ్లా బేలవైపోతున్నావేమమ్మా!" తల్లి వీపుమీద రెండు చేతుల్తో తడిమాడు మెల్లిగా.

"నువ్వులేకుండా నేనెట్లా బతకనుబాబు." భోరుమంది తల్లి.

ఆమె మొహం పైకెత్తి కళ్ళలోకి చూస్తూ:

"నేనెవరికోసమైతే ప్రాణత్యాగం చేస్తున్నానో వారికోసమైన నువ్వు జీవించాలమ్మా. నీ ఆఖరి క్షణంకూడా వారిశ్రేస్సుకోసం వెచ్చించు. అమ్మా! ఇంతకాలం నేనొక్కన్నే నీకొడుకును. కాని ఇకనుంచి వాళ్లంతా నీకొడుకులేనమ్మా. అప్రయోజకంగా బ్రతకడానికి మానవజన్మ ఎందుకు? మనం మానవులుగా పుట్టినందుకయినా ప్రయోజకంగా బతకాలి. ఏమంటావమ్మా?"

"అవునుబాబు అవును." అస్పష్టంగా గొణిగింది తల్లి. కాని ఆ మాతృమూర్తి ఎంత ప్రయత్నించినా శోకించకుండా ఉండలేకపోతోంది. మరణించిన కొడుకుని చూచినప్పటికన్నా ఈరోజు సజీవంగాఉండి కొద్దిగంటల్లో మరణించబోయే కొడుకుని చూస్తున్నప్పుడు కలిగే ఆవేదన ఎన్నోరెట్లు ఎక్కువ.

వార్డర్ వచ్చి తల్లివీపుమీద లాఠీకర్రపెట్టి, "అమ్మా! టైమయింది ఇకపో" అన్నాడు.

ఆ తల్లి మళ్లీ భోరుమని ఏడుస్తూ కొడుకు శరీరాన్ని తనివితీరా తడిమింది, ఒక్కసారి తన కొడుకుని గుండెలకు హత్తుకోవాలని ఆమె హృదయం తపిస్తున్న ఇరువురికీ మధ్య ఇనుపచువ్వలు అడ్డంగా ఉన్నాయి.

"అమ్మా! ధైర్యంగా ఉండు." అతడు బలవంతాన అన్నాడు.

"నా బిడ్డా ...... " ఆమె దుఃఖాన్ని ఆణచుకోలేక పోయింది.

"ఓ అమ్మా నీకుకాదా చెప్పేది టైమయిందినడు. నడు" అంటూ వార్డర్ తల్లిని తోశాడు.

కదలలేక కదలలేక అక్కడ్నించి కదిలింది ఆ తల్లి బరువెక్కిన హృదయాన్ని మోసుకుంటూ.

ఇనుపచువ్వల్ని పట్టుకుని అనిమిష నేత్రాల్తో అలాగే భావోద్వేగంతో చూస్తూ నిల్చుండిపోయాడు అతను... మృత్యువునే ధిక్కరించి తను నమ్మిన ఆదర్శంకోసం సగర్వంగా ప్రాణాలర్పిస్తున్న ఆ నూతన మానవుడు!

'ప్రతి తల్లీ ఒక విప్లవ సూర్యుణ్ని ప్రసవించాలి'— నగ్నముని

మృతవీరుల సంస్మరణ

జనవరి 15 మృతవీరుల సంస్మరణ దినం. తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట కాలంలో వీరమరణం పొందిన అమరవీరులను తలచుకునే దినం. పాలకవర్గం కూడ తన ప్రయోజనాలకొరకు చనిపోయిన వారిని పూజిస్తుంది. ప్రజలను పూజించమని పురమాయిస్తుంది. ప్రతి ఏటా జనవరి 30 గాంధీ వర్ధంతిని మృతవీరులకు శ్రద్ధాంజలి ఘటించే దినంగా జరుపుతుంది. ఈసారి అది చాలనట్లు జనవరి 26 రోజు కూడ అమరవీరుల సంస్మరణదినంగా చేస్తున్నది. 25 ఏళ్లగా యీ గడ్డమీద పీడితుల రక్తాలు చిందించిన యీ పోలీసు గణతంత్ర ప్రభుత్వం. గాంధీ నామ జపమాల మెళ్ళోవేసుకొని అహింసా మంత్రోచ్చారణచేస్తూ నరమాంసం రుచిమరిగిన ఈ 'ఇండియన్ టైగర్' హింసలో 'బ్రిటిష్ సింహం' పాటించే రూల్ ఆఫ్ లాను కూడ మింగివేసింది. ఎవరికి మేలుచేసినవాళ్ళను వాళ్లు తలచుకుంటారు పేదవాళ్లు తమకు మేలు చేసినవాళ్లను ఎన్నడూ మరచిపోరు. బోసినోటి గాంధీ బిర్లాపై నెహ్రూపై కురిపించిన చిరునవ్వులు వాళ్ళకు బోధపడవేమో కాని పార్లమెంట్‌లో బాంబువేసిన భగత్‌సింగ్ సాహసాన్ని భారత ప్రజలకోసం ఉరికంబం ఎక్కిన అతని త్యాగాన్ని యువతరం హృదయంలో వెచ్చగా పదిలపరుచుకుంటుంది.

మేధావి అంటే చారుమజుందార్ అని. ఆదర్శ దంపతులంటే పంచాదినిర్మలా కృష్ణమూర్తులని, మేస్త్రారంటే సత్యమని. కవి అంటే పాణిగ్రాహిఅని. న్యాయవాది అంటే బత్తుల అని, డాక్టర్లంటే భాస్కర మల్లికార్జునులని ఈ బూర్జువాచరిత్ర ఎక్కడ చెప్పకున్నా పీడితులు తమ హృదయాల్లో మౌనంగా యీ అర్థాలు గ్రహించారు. అదే మాట యీనాటి విప్లవ యువతరం, యీనాటి విప్లవ సాహిత్యం ఎలుగెత్తి చాటుతున్నది. విప్లవ సాహిత్యం విప్లవ పోరాటాల చరిత్ర వెలుగులోకి తేవాల్సి వున్నది. మనం మన మృతవీరులను తలచుకుందాం. అయితే మన సంస్మరణ వీరపూజ వీరులను పిరికివాళ్లు పూజించలేరు. వీర వారసత్వాన్ని స్వీకరించి వారి ఆశయాలకొరకు ఆదర్శాలకొరకు మనంకూడ జీవించడమేకాదు మరణించడానికికూడ సిద్ధమయినపుడే వాళ్ల స్మరణ సార్థకమవుతుంది. ఇది త్యాగాలయుగం. బలిదానాల యుగం. విజయాల యుగం. విప్లవ యుగం. మనిషికి అన్నిటికన్న తియ్యనిది ప్రాణం. ప్రాణికి విలువయిన కాలం యవ్వనం. యవ్వనం గర్వంగా వెలిగే కాలం విద్యార్థిదశ. ఈ యవ్వనాన్ని, యవ్వన దాంపత్య సుఖాన్ని తృణప్రాయంగా ఎంచి శ్రీకాకుళ గిరిజన పోరాటంలో దూకిన పంచాది కృష్ణమూర్తి విద్యార్థులకు, యువకులకు, మేధావులకు ఆదర్శం కాదగినవాడు.

## పంచాది కృష్ణమూర్తి

అది జూన్ 27, 1969. తెల్లారే సమయం.

"విప్లవం వర్ధిల్లాలి".

"చైర్మన్ మావో వర్ధిల్లాలి"

"కమ్యూనిస్టు పార్టీ వర్ధిల్లాలి"

కొండలు ప్రతిధ్వనించాయి. దిక్కులు పిక్కటిల్లాయి. ప్రకృతి మాత విలపించింది. ప్రజలను సమీకరించింది. ఏం జరుగనున్నదో ఆతృతగా చూస్తున్నారు.

"నిరాయుధులను కాల్చి చంపడంలో వీరత్వం లేదు. ధైర్యముంటే మాకూ తుపాకులివ్వండి కాల్చుకుందాం. ఎవరు వీరులో తేల్చుకుందాం" గర్జించిందొక కంఠం.

ఆ విప్లవకిశోరం కామ్రేడ్ పంచాది కృష్ణమూర్తి. వాళ్ళంతా ఆయన సహచరులు. తామాడ చిన్నారావు(చినబాబు), దున్నా గోపాలరావు, ఎస్. నర్సింహులు, బైనపల్లి పాపారావు, రాంచందర్, నిరంజన్‌లు.

కలకత్తానుండి రైతాంగ పోరాట భవిష్యత్తును మోసుకొని సోంపేట స్టేషన్‌లో దిగాడు. పోరాట ప్రాంతంలో అడుగు పెట్టాలంటే దమ్ములేని పోలీసులు హఠాత్తుగా పైనబడ్డారు. ఆయనతో ఉన్న ముగ్గుర్నీ, వాళ్ళకోసం వెళ్ళిన మరిముగ్గుర్నీ రెక్కలు విరిచికట్టి జలాంత్రపుకోట కొండ ప్రాంతానికి తీసుకెళ్లారు. ఒక్కొక్క వెలుగుతారనే కూల్చారు. చివరకు మన ధృవతార గుండెల్లో తూటాగాదు, తూటాలు పేల్చారు-యోధుడు నేలకొరిగాడు.

మరణం ప్రతివ్యక్తికి సర్వసాధారణమైన సంఘటన. కాని ప్రజలకోసం మరణించడం హిమాలయ పర్వతంకన్నా ఉన్నతమైనది. ప్రజాశత్రువులకొరకు మరణించడం ఈకెకన్నా తేలికైనది.

తానే ప్రజలు, ప్రజలే తానుగా బతికి, ప్రజలకోసం ప్రాణాలర్పించిన ప్రజల మనిషినుండి ఈథర్ ఈ సందేశాన్ని మనకోసం మోసుకొచ్చింది.

పంచాది కృష్ణమూర్తి ఆలోచనాపరుడేకాదు, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆకళించుకున్న మేధావి. మాటలు కాదు. చేతలు కావాలన్నాడు. అందుకే భారత దేశ కమ్యూనిస్టు ఉద్యమానికి పట్టిన పాత, కొత్త, సరికొత్త రివిజనిజాల చెదలునుదులిపే చరిత్రాత్మక పోరాట అగ్రభాగాన నిలిచాడు.

మావో ఆలోచనావిధానం పునాదిగా నగ్జల్‌బరీ విప్లవ పంథాలో ఆంధ్రదేశంలో రైతాంగ పోరాటం మొదలైంది. దానికి తలిమానికం శ్రీకాకుళం జిల్లా పోరాటం. ఆ

పోరాటానికి నాయకుడు ప్రతినిధి పంచాది కృష్ణమూర్తి. ఆ పోరాటాన్ని ప్లానుచేసి, అమలుజరిపి అభివృద్ధి చెయ్యటంలో ప్రధాన భాగస్వామి. అపార ప్రజాభిమానాన్ని ఆకట్టుకొన్న ప్రజల మనిషి-

నేడు విప్లవకారులపై చరిత్ర నిలిపిన కర్తవ్యాన్ని అత్యంత చొరవతో నిర్వహించాడు. తెలుగునేల నలుచెరగులా విప్లవాగ్నులు పంచాడు- ఆంధ్ర విప్లవ రైతాంగ పోరాట నాయకుడేకాదు. భారత దేశమంతటా విప్లవోద్యమాన్ని ముందుకునడిపే రాజకీయ, నిర్మాణ కార్యక్రమాన్ని రూపొందించడంలో భాగస్థుడు. భారత కమ్యూనిస్టు పార్టీ(మార్క్సిస్టు-లెనినిస్టు) నిర్మాణంలో ప్రముఖ పాత్రధారి. పార్టీ రాష్ట్ర, కేంద్ర కమిటీల్లో సభ్యుడుగా అచంచల పట్టుదలతో కార్యభారాన్ని నిర్వహించిన దీక్షాపరుడు.

విప్లవకారుడుగా జీవించటం గొప్ప విషయం. విప్లవకారుడుగా మరణించటం అన్నిటికన్నా గొప్పవిషయం.

ఈ తెలుగుతల్లి ముద్దుబిడ్డ విప్లవకారుడుగా బతకడమేకాదు, విప్లవకారుడుగా మరణించి మనమధ్య జీవిస్తున్నాడు-

విప్లవ రైతాంగ చరిత్రలో వీరుడుగా, పేదప్రజానీకపు వెలుగురేఖగా వెలిగిన ఈఆదర్శమూర్తిని కన్నది ఓ పేదరైతు కుటుంబం. భూస్వాముల గుండెల్లో గునపాలు దించి ఈవ్యవస్థాంతకుల చిత్రహింసలకు అసువులుబాసిన పంచాది నిర్మల యీయన సహచారిణి. ఇబ్బందులెదురైనా ఎం.ఏ పూర్తి చేశాడు బూర్జువా విద్యాభ్యాసం వ్యక్తిగత సౌఖ్యమిస్తుంది. కాని తనముందు నికృష్టంగా బతికే కోట్లాది ప్రజలున్నారు దోపిడీ నుండి వాళ్ళను విముక్తి చేయడమే తన వృత్తిగా స్వీకరించాడు. ఈ ఉన్నతాశయమే ఆయనను గొప్ప ఆర్గనైజర్‌నుచేసి, ఎన్ని ప్రశ్నలకైనా చిరునవ్వుతో జవాబు చెప్పగలిగే ఓర్పును. విసుగు విరామంలేకుండా నిరంతరం కార్యక్రమంలో నిమగ్నమయ్యే శక్తినిచ్చింది-

మానవజన్మ అన్నిజన్మలకన్నా ఉత్తమమైనది. ప్రతి ఒకరికీ అది ఒకేసారి వస్తుంది. చనిపోయేముందు తాను ప్రజలకొరకు జీవించాననే సంతృప్తి ఆ వ్యక్తికుంటే, అలాంటి వ్యక్తి ధన్యజీవి.

బతికినన్నాళ్ళూ సార్థకంగా బతికిన కృష్ణమూర్తి వీరమరణం వేలాది మందిని ఉత్తేజితుల్ని చేసింది. చేస్తున్నది. మృత్యువును జయించటమెలాగో ఆయన మనకు నేర్పాడు. విప్లవం ప్రాణం. మరణం మంచినీళ్ళ ప్రాయం. పీడిత ప్రజల ఉజ్వల భవిష్యత్తుకు అంకితమై విప్లవాన్ని పరిపూర్తి చేయవలసిన పవిత్రకర్తవ్యం మనపైఉంచి, ప్రజల్లో ఆలోచనల్లో జీవిస్తున్నాడు మన పంచాది.

## పంచాది కృష్ణమూర్తి

జోహారు, జోహారు నీకిదే
ఓ విప్లవజ్యోతి, కృష్ణమూర్తి ॥జోహారు॥

వీరభూమి ఈ భరతభూమిలో,
వీరుడవై జన్మించినావయా!
అనాథ బ్రతుకుల సముద్ధరణకై,
అమరజీవివై, వెలిగినావయా ॥జోహారు॥

వెట్టిచాకిరి, పరులదోపిడీ,
కూకటివేళ్ళతో కూల్చివేయగా!
పట్టుబట్టి చే తుపాకిబట్టి,
'గట్టివాడ' వన్పించినావయా ॥జోహారు॥

"మండుటెండలో మలమలమాడి,
ఎండుడొక్కలతో నకనకలాడే,"
కొండ జాతులకు అండగనిల్చి,
"విముక్తిమార్గం" చూపినావయా ॥జోహారు॥

చదివిన చదువుకు విలువగలుగగా,
పరులసుఖంకై త్యాగంచేసి,
స్వార్థ త్యాగము ప్రతి యువకునకు,
చిరునవ్వులతో నేర్పినావయా ॥జోహారు॥

చుట్టువున్న ఈ చీకటిచూచి,
మావో చూపిన బాటనునడచి
విప్లవమ్మనే వెలుతురుజెండా
పీడిత ప్రజలకు యిచ్చినావయా

జోహారు, జోహారు నీకిదే
ఓ విప్లవజ్యోతి, కృష్ణమూర్తి!

— ప్రేమపార్థానంద్

## బత్తుల వెంకటేశ్వరరావు

ఓ... వీరయువకా వెంక టేశ్వర
విప్లవ జోహారులివిగోరా

ఖమ్మము జిల్లాలో నీవు
యువక సంఘ వీరుడవై
ఉన్నత విద్యలు చదివావు

ఓ వీరసింహ విప్లవకిశోరా
వీరుడా జోహారులివిగోరా

రాజకీయ రంగమందు
యువకుల పురిగొల్పినీవు
సంఘకట్టుతో సమరము సలిపావు

ఓ ధీరుడా బలశూరుడా నీవు
సమర రంగసాయుధుడవైనావు

ఎందరెందరో వీరయువకుల
కదనరంగమందు నిలిపి
న్యాయమార్గము బాట జూపావు

ఓ ఆంధ్రియువకా వెంక టేశ్వరా
విప్లవ జోహారులివిగోరా

నీవు నడచిన సంఘబాటలు
కొండలడవులు నిండుతున్నవి
విప్లవ జ్వాలలై వెలిగాయి

ఓ అమరజీవి వీరపుత్రా
కోటి తెలుగులధాటి జూపావోయ్
బూజుపట్టిన పాలనంబును
నేలమట్టము చేయుటకు
విప్లవసేనై నిలిచావోయ్

ఓ తెలంగాణా వీరయువకా
తెల్గు ప్రజలకు నాయకుడవై నావు

పాపి పాలన కూల్చివేసి
ప్రజల పాలన నిల్పుటకు
ప్రజలముందు పరుగులెత్తావు

ఓ విప్లవాత్మక వెంకటేశ్వర
దుష్టపాలన గుట్టు తెలిపావు

చరిత్రాత్మక మైనట్టి
తెలంగాణా సాయుధుడవై
విప్లవజ్వాల లేపావు

ఓ... కార్యశూరా వెంకటేశ్వర
సర్వ ప్రజల ఆదరణపొందావు

శతృవులు నిన్ను పట్టుకొని
కొట్టి సంపిరి గొందిగూడెంలో
కూలిపోతివా కొండవలె నీవు

ఓ అమరవీర వెంకటేశ్వర
విప్లవ జోహారులివిగోరా

కామ్రేడా నిన్ను బలిగొనిన
కసాయిల మట్టుబెట్టి
నీదు ఆశయం నిల్పి తీరుతామోయ్

ఓ వీరయువకా వెంకటేశ్వర
విప్లవ జోహారులివిగోరా

## అమరుడు మా నర్సయ్య

ఓ నర్సయ్యా! నా లక్ష్మినర్సయ్యా! కామ్రేడ్
ఖమ్మం కారడవుల్లో భాస్కరునిగా వెలిగి
కామ్రేడ్ పెద్దన్నకు అండగా చిన్నన్నగా నిలిచావని
నిన్నగాక మొన్న నిన్నుగూర్చి విన్ననేను
విప్లవోత్సాహముతో పరవళ్లు తొక్కినాను;
అంతలోనేనీవు అస్తమించి
మాపై బరువు బాధ్యతలుపెంచి
మమువీడి వెళిపోయావా నేస్తం.

నర్సంపేట అడవుల్లో కోయజాతి వాడల్లో
వేషములో వచనములో
గిరిజనుల్లో గిరిజనుడవై
కలసిమెలిసి పోయావని
బరితెగించిన దగాకోర్ల గుండెల్లో
భాస్కర్ దళమంటె బలువై పోయిందని
నిన్నగాక మొన్న నిన్నుగూర్చి విన్ననేను
నీలో వెంపటాపు సత్యాన్ని చూస్తానని,
కదనరంగములో కత్తిబట్టిన నీవు
నీ కర్తవ్యాలను విస్తృతంజేసి
కత్తిని కలాన్ని ఒక్కటిగాభావించి
తుపాకితో కథానికలు రాస్తున్నావని
నిన్నగాక మొన్న నిన్నుగూర్చి విన్ననేను
నీలో సుబ్బారావు పాణిగ్రాహిని చూస్తానని,

వస్తే విప్లవ విజేతగా తిరిగివస్తావని
చస్తే నీవెందుకు చచ్చావో
నీ చిన్నారి భాస్కర్‌కు తెలియచెప్పాలని

వాణ్ణి విప్లవకారునిగా తీర్చిదిద్దాలని
నీ యడబాటుతో కుమిలిపోతున్న నీ భార్యకు
నిన్నగాక మొన్న కర్తవ్యాన్ని నిర్దేశించిననీలో
చూశాను జూలియస్ ఫూజిక్‌ను,

శతృవు నీ ఎదపై తుపాకినిలిపి
రహస్యాలు చెప్పుమన్నప్పుడు
నీవూ నీదళ సభ్యులు ప్రదర్శించిన
అపూర్వ అద్భుత సాహసం
అమరగాథగా నిలుస్తుంది;

నేడస్తమించిన భాస్కరుడు
రేపు విజయభాస్కరుడై వెలుగుతాడు
అందుకే అంటున్నా అమరుడు మా నర్సయ్య.

— జి. ఆర్.

## నక్సల్‌బరీ మొక్క

నక్సల్‌బరీలో నాటిన మొక్కను నేను
నిటారులా పెరగటం కాదు
విశాలంగా వ్యాపించటం నా ధ్యేయం
శ్రీకాకుళ కీకారణ్యాలకు మాత్రమేకాదు
ములుగు మూలలకుకూడా
రక్తతోరణం కట్టాను
నీళ్ళు కారటం కాదు
నిప్పులు పూయటం నా జీవితాదర్శం
నా కొమ్మలకు కాయలు మాత్రమేకాదు
భూస్వాముల తలకాయలుకూడా కాస్తాయి

నా కొమ్మలు కొన్ని నరికారేమోకాని
నా వేళ్లెక్కడున్నాయో వీళ్ళకేం తెలుసు
నరికినకొద్దీ విరగబూస్తాను
విరగబూసి విరగబూసి
చరిత్రను తిరగరాస్తాను
అయినా నన్నెవరూ చంపలేరు
నేను నేటి ప్రపంచవాస్తవాన్ని విప్లవాన్ని.

— ప్రిభంజన్

## అరెస్టు చేయగలవా?

నరెర్రింగ సెట్టుకింద కన్నెర్ర చేసిన నరుడ్ని,
బరెర్రింక సెట్టుకింద బందూకు పట్టిన భాస్కరుడ్ని,
అడవిదున్న కంటిలో జనబాణాన్ని
సూటిగా కొట్టిన సత్యాన్ని,
అరెస్టు చేయగలిగానని విర్రవీగుతున్నావా?
బద్మాష్!
ఐతే,
ఉప్పెనలా పొంగి పొరలే
ప్రజాహృదయాల్లోని విప్లవ వాంఛను
'తుపాకి గొట్టంద్వారానే రాజ్యాధికారం వస్తుంద'ని
గర్జించే వేలాది యువకిశోరాల విప్లవవాణిని
వర్గశత్రు నిర్మూలనతో విప్లవోత్సవాలు
జరుపుకోవాలనే కోట్లాది పేదరైతుల తహతహను
దోపిడీ ప్రభుత్వాన్ని ధ్వంసం చేసేందుకై
నలుచెరగులా దావాగ్నుల్లా వ్యాపిస్తున్న సాయుధపోరాటాలను
చీపురు కట్టతో ఊడ్చనిదే దుమ్ము దానంతటదే
పోదని ఘోషిస్తూన్న మావో సూక్తుల్లోని సత్యాన్ని
అరెస్టు చేయగలవా?

— గిరిసింహం

# ఓ! పల్లెటూరి పేదరైతా!

ఓ! పల్లెటూరి పేదరైతా!
నీ పిల్ల మేకా పీనుగయ్యేరా!
నిన్ను కరువుకాలం కాటువేసిందా!

గుక్కెడయినా గంజిలేక
గుక్కపట్టి పిల్ల ఏడ్వ
కడుపు చెరువయి తల్లి ఏడ్చిందా!
నీ గుండెపగిలి నెత్తురొలికిందా!
ఓ! పల్లెటూరి పేదరైతా!
నీ పిల్ల మేకా పీనుగయ్యేరా!
నిన్ను కరువుకాలం కాటువేసిందా!

ఎంత ఏడ్చి ఏమి ఫలము?
ఎంత మొక్కిన ఏమి ఫలము?
దొరల గుండెలు కరుగవోరన్నా!
ఆ దొరలు నీదు మొరలు వినరన్నా!
ఓ! పల్లెటూరి పేదరైతా!
ఈ ప్రభుత్వము నీదికాదన్నా!
(ఓ! పల్లెటూరి)

కరువుబాధకు కుంగనేల?
కరువు బాధకు కుమలనేల?
దొరలకాళ్ళు పట్టనేల?
ముత్యాలమ్మకు మొక్కనేల?
తిరగబడితే సుఖము గలదన్నా!
ఓ! పల్లెటూరి పేదరైతా!
మరలబడితే మంచిగలదన్నా!
(ఓ! పల్లెటూరి)

చెమట ఓడ్చి పంటలేస్తే
దొరల గరిసెల బందీ అయ్యె
ఆ బందిఖానా పగులగొట్టన్నా!
ఆ తిండిగింజలు వెలికితీయన్నా!
ఓ! పల్లెటూరి పేదరైతా!
నీ వర్గశక్తిని తెలుసుకోరన్నా!
నీ వర్గశక్తికి ఎదురులేదన్నా!
(ఓ! పల్లెటూరి)

ఆకటితో అలమటించి
కుక్కచావు చచ్చేకన్నా
పోరులోన చావు మేలన్నా!
ఓ! పల్లెటూరి పేదరైతా!
కుక్కచావు చావకోరన్నా!
పోరులోన చావు మేలన్నా!
(ఓ! పల్లెటూరి)

నీ పిల్లమేకా చల్లగవుండే
కరువులేని బతుకు కోసం
పోరుచేసే సేనచూడన్నా!
ఆ ఎర్రసేనకు తోడురారన్నా!
ఆ ఎర్రసేనలో చేరరారన్నా!
ఓ! పల్లెటూరి పేదరైతా!
ఇది కరువుకాలమొక టేగాదన్నా!
ఇది దొరలుగూలే కాలమోరన్నా!
ఇది దొరలురాలే కాలమోరన్నా!
ఓ! పల్లెటూరి పేదరైతా!
ఇది కరువుకాలమొక టేగాదన్నా!

— సాగర్

## మండే సత్యం

ఎర్రిన్నొచ్చె మారన్నొచ్చే
ఎర్రోళ్ళ సూరన్నొచ్చె
విప్లవానికి వీరన్నొచ్చేరా !
ఓ రైతుకూలీ రణరంగన్నా
రగులుకొనెరా అగ్గిబరాటలు

గండుచీమల భారీ దండు
కొండలన్నీ నిండాలన్నా
కొండచిలువల గుండెలాగాలి !
ఓ రైతుకూలీ రణరంగన్నా
గుండెలాగి పెండబెట్టాలి.

భూస్వాములు బుసకొట్టేరు
నాగుపాములై పడగెత్తేరు
నక్కి సమయము చూచుకోరన్నా !
ఓ రైతుకూలీ రణరంగన్నా
విషం కోరలు పీకివేయన్నా

కాలమెంతో కఠినమైనది
అయినా మన కనువేనోయి
క్రూర సర్పము తోకబట్టన్నా !
ఓ రైతుకూలీ రణరంగన్నా
బండకేసి పిండిగొట్టన్నా

ఒక్కవారంతొక్కటయ్యి
ఏకముగ ఎదురు తిరిగితె
లోకమందసాధ్యమేదన్నా !
ఓ రైతుకూలీ రణరంగన్నా
రష్య చైనల చరిత్ర గనరన్నా

మనకునేర్పిన గతితర్కము
మనిషి పుట్టిననాటినుండి
పోరాటాల చరిత్రమయమన్నా !
ఓ రైతుకూలీ రణరంగన్నా
లొంగిపోతె కృంగదొక్కేరు.

ఆశయము నెరవేరెదారులు
వేసినారు అమరవీరులు
అదుగొ చూడు అరుణ దిశను !
ఓ రైతుకూలీ రణరంగన్నా
అడుగుజాడల అనుసరిద్దాము.

# అంతం కాదిది ఆరంభం

భూమి కోసం, భుక్తి కోసం
సాగే రైతుల పోరాటం
అనంత జీవిత సంగ్రామం

రాజులు మారీ
రోజులు మారీ
పాలన చేసే పద్ధతి మారీ-
మారని దొకటేరా— అది
దున్నే రైతుల బతుకేరా—

సంపద పెంచే తీరులు మారీ
పంపకాలలో రీతులు మారీ-
మారని దొకటేరా- అది
పేదల ఆకలి మంటేరా ॥

తూరుపు దిక్కున వీచేగాలి
పడమటి కడలిని పిలిచేగాలి
తూరుపు పడమర లేకం చేసే
తుఫానులా చెలరేగేదాకా

భూమి కోసం
భుక్తి కోసం
సాగే రైతుల పోరాటం
అంతం కాదిది
ఆరంభం ॥

— శ్రీ శ్రీ

ఆత్మవిమర్శ :

# విప్లవ మేధావుల కర్తవ్యం

శ్రీహరి

పుట్టుకతో ఎవరూ మేధావిగానో, కూలివాడుగానో, మరొకటిగానో పుట్టరు. ఈ సమాజం కల్పించే అవకాశాలవలననే ఒకరు ఉన్నత విద్యావంతుడు కావటం మరొకరు వాటికి దూరం కావటం జరుగుతుంది. కనుకనే మేధావికి సమాజం యెడల బాధ్యతవుంది. అందులోనూ విప్లవ మేధావులైన వాళ్లకు చాలా గురుతరమైన బాధ్యత వుంది.

అర్ధవలస– అర్ధ భూస్వామ్య దేశమైన మనదేశంలో అత్యధిక సంఖ్యాక ప్రజానీకం నిరక్షరాస్యులు. వేల సంవత్సరాలుగా సామ్రాజ్యవాద, భూస్వామ్య సంస్కృతుల ప్రభావానికి గురిచేయబడినవారు. అనేక మూఢనమ్మకాలకు, అంధవిశ్వాసాలకు బానిసలుగా వున్నవారు.

కనుక సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేకమైన నూతన ప్రజాతంత్ర సంస్కృతిని ప్రచారం చేయటం విప్లవ మేధావుల కర్తవ్యం. దీనికి జాతీయ స్వభావమూ, ప్రజాస్వామ్య స్వభావమూ వుంటుంది.

అయితే కేవలం విప్లవకవిత్వం రాయటంతో యీ కర్తవ్యం పూర్తిగాదు.

ప్రధానంగా మేధావులు భారత దేశ గతచరిత్రను, ప్రస్తుతచరిత్రను అధ్యయనం చేయాలి. విదేశాల చరిత్రను అధ్యయనం చేయాలి. గతి తార్కిక భౌతికవాదదృష్టితో చరిత్ర పరిశీలించి వాటినుండి తగు గుణపాఠాలను ప్రజలకు అందుబాటు చేయాలి.

ఉదాహరణకు భారత దేశ చరిత్రలో యేదశలో యే విధమైన విప్లవపోరాటాలు జరిగాయి. ఆ తర్వాత చరిత్రపై వాటి ప్రభావమేమిటి ? వాటినుండి తీసుకోవలసిన గుణపాఠాలేమిటి ? వీటిని విప్లవ మేధావులు అధ్యయనం చేయాలి. ఇటీవల భారత దేశంలో కొనసాగిన విప్లవ రైతాంగ సాయుధపోరాటాల చరిత్రకూడా అత్యధికసంఖ్యాక సామాన్య ప్రజానీకానికేకాక– మేధావి వర్గం అనుకునేవారికికూడా తెలియదంటే మన మెంత వెనుకబడివున్నామో అర్థమవుతుంది.

ఆదిమ కమ్యూనిస్టు దశనుండి యిప్పటివరకు భారత దేశ వుత్పత్తి విధానాలలో

వచ్చిన మార్పులు— అందులోనూ భారతదేశ ప్రత్యేకతలను మనం అధ్యయనం చేయాలి. తద్వారనే మన దేశంలో విప్లవ పురోగమనాన్ని సుగమం చేయగల్గుతాం.

ఇది వి.ర.సం. (విప్లవ రచయితల సంఘం)సభ్యుల, సభ్యులు కానివారి బాధ్యత కూడా! ఈ విషయంలో యింతవరకు జరిగిన కృషి చాల స్వల్పం. అయితే యీ కర్తవ్యాన్ని నెరవేర్చడానికి మార్క్సిజం- లెనినిజాన్ని విప్లవ రచయితలు లోతుగా అధ్యయనం చేయాలి.

ఇకపోతే విప్లవ రచనల విషయంలో కవిత్వంలో చెప్పుకోదగిన పురోగమనం కనిపిస్తున్నది. ఈ మధ్య ప్రజాజీవితాన్ని, ప్రజాపోరాటాలను చిత్రించే పాటలుకూడా వస్తున్నాయి.

అయితే కథ, నవల, నాటకం విషయంలో చెప్పుకోదగినకృషి జరుగలేదు.

భూస్వామ్య, సామ్రాజ్యవాద దోపిడీని చిత్రించే కథలు కొన్ని వచ్చాయి. కాని విప్లవోన్ముఖులవుతున్న ప్రజల చైతన్యాన్ని, ఆ చైతన్యం అభివృద్ధి చెందుతున్న క్రమాన్ని సహజంగా చిత్రిస్తూ వచ్చినకథలు లేవు. వచ్చిన కొన్నికథలు సమగ్రంగా లేవు.

ఇంతవరకు విప్లవ పోరాటాన్ని చిత్రిస్తున్న ఒక్క నవలకూడా రాలేదు.

విప్లవ కథలకు, నవలలకు, నాటకాలకు ప్రజలలో ఎక్కువ ఆదరణ వుంటుంది. విప్లవ పోరాటాన్ని గురించిన సరైన, సమగ్రమైన అవగాహనను నవల, నాటకం మాత్రమే కల్గించగల్గుతాయి. వాటికి చాలా ప్రబోధం విలువ వుంటుంది, కనుక ఈ రంగంలో విప్లవ రచయితలు ద్విగుణీకృత కృషి చేయాలి.

అయితే నవల, నాటకం రాసిన రచయితకు స్వతహాగా లోతైన అవగాహన వుండవలసి వుంటుంది. ప్రజలతో చాలా సన్నిహితంగాఉన్న రచయితకుమాత్రమే అలాంటి అవగాహన ఏర్పడుతుంది. అలాంటి రచయితరాసే కవితలుకూడా సజీవంగా వుంటాయి.

ఇప్పుడు వచ్చే విప్లవ కవిత్వం చాలా తక్కువ మందికి అందుబాటులో వుంటున్నది. సామాన్య పాఠకులు, విద్యార్థులు యీ కవిత్వం తమ కర్థం కావటంలేదని ఫిర్యాదు చేస్తున్నారు. అటువంటప్పుడు సామాన్య ప్రజానీకానికి చదివి వినిపించినా అర్థం చేసుకోవటం అసాధ్యం. ఈ కవిత్వం ఆచరణలో కొద్దిమందిగా ఉన్న మేధావి

వర్గానికి మాత్రమే అందుబాటులో వుంటున్నది. కనుక విప్లవ కవులుకూడా తమ సాహిత్యం ఎవరికోసం? అన్న ప్రశ్న వేసుకోవాలి.

కార్మికులకు, కూలీలకు, పేదరైతులకు విద్యార్థులకు, విప్లవకారులకు, సానుభూతిపరులకు అందుబాటులో వుండేటట్టు వివిధస్థాయిల కవిత్వాన్ని రాయాలి. దీనికి అత్యధిక ప్రాధాన్యత నివ్వాలి.

సులభశైలిలో, సూటిగా, కళాత్మకంగా రచనలు వుండాలి. అంతేగాని తమ రచన తమకో, తమలాంటి చిన్నగ్రూపుకో తప్ప యితరులకు అర్థంకానంత క్లిష్టంగా అస్పష్టంగా విప్లవ రచయిత రచనలు వుండకూడదు. అలా వుంటే ఆ రచనలు ఆశించిన ప్రయోజనాన్ని నెరవేర్చవు.

మరో విషయంలో విరసం వైఫల్యం స్పష్టంగా కనిపిస్తున్నది.

గ్రామాలలోని సామాన్య ప్రజానీకంలోకి వివిధ ప్రజా కళారూపాలద్వారావిప్లవ సాహిత్యాన్ని తీసుకు పోవాలని విరసం ప్రథమ మహాసభలలో తీసుకున్న నిర్ణయం యింకా అమలులో పెట్టబడలేదు.

బుర్రకథలు, జముకుల కథలు, నాటకాలు, పాటలు— ఈ రూపాలు యింకా ప్రజలు అభిమానించే యితర కళారూపాలద్వారా ప్రజలలోకి పోవాలి.

పై రచనలు చేయటం ఒక కర్తవ్యం. ఆ రచనలను ప్రజలలోకి తీసుకు పోవటం మరో విషయం. దీనికోసం అంకితమైన కార్యకర్తలు కావలసి వుంటుంది. రెండూ జరగలేదు.

ఈ విషయంలో తన వైఫల్యానికి కారణాలను విరసం ఆత్మవిమర్శ చేసుకొని, యిప్పటికైనా యీ కర్తవ్య నిర్వహణకు తగు ఆచరణాత్మక చర్యలు తీసుకోవాలి.

# సాహిత్య వ్యాసాలు V

గోర్కీ

## సాహిత్యం- కళ- సంస్కృతి (1909)

కేవలం సంపదలకే కాదు సంస్కృతికి కూడా మూలం ప్రజాశక్తే. కథలు, కవిత్వాలు, కళలు, ఒకటేమిటి మానవుడి సాంస్కృతిక చరిత్ర యావత్తు ప్రజాశక్తి నుంచే పుట్టింది.

మానవజాతి తన మనుగడ కోసం మొట్టమొదట్లో చాలా పెనుగులాడింది. అప్పట్లో ప్రకృతి శక్తులనుచూస్తే భయం, సంభ్రమం, ఆశ్చర్యం కల్గేవి. ఈమూటి నుంచే మతం పుట్టింది. ప్రకృతి శక్తులతో మానవుడి సంఘర్షణ, అతని జ్ఞానం ఇవే ఆనాటి కవిత్వాలకు ఆలంబన, ప్రకృతిపై మానవుడు సాధించిన విజయాలు అతని ఆత్మ విశ్వాసానికి సోపానాలు, ఆ విజయాలే మానవుడిని ఇతిహాసాలసృష్టికి పురికొల్పాయి. ఇతిహాసాలు ఆనాటి జ్ఞానకోశాలు. ఆ తరువాత ఇతిహాసాల్లో పురాణాలను కలగా పులగం చేసేశారు. పురాణాల్లో మానవుడి ఉమ్మడి ఆశలు, వాటి కనుగుణంగా దిద్దిన దేవుళ్ళు, మొనగాళ్ళు మనకు కన్పిస్తారు. భాషలోలాగానే మన ఇతిహాసాల్లోనూ, పురాణాల్లోనూ కూడ కనిపించేది కేవలం ఒకవ్యక్తి ఉద్రేకంకాదు, మొత్తం జనమందరి సృజనాత్మక చైతన్యం.

"సామాజిక అవసరాల్లో ముఖ్యమైంది భాష. భాషానిర్మాణంలో ప్రతివ్యక్తి పాల్గొంటాడు. కాని అలా పాల్గొనేటప్పుడు ఏవ్యక్తి జనశక్తికి ఎడంగావుండదు. 'వ్యక్తికి బహువచనం శక్తి' అన్నమాట భాషవిషయంలో చక్కగా అన్వయిస్తుంది" అన్నాడు బుసల్యేవ్

భాషాశాస్త్రం చూసినా, సంస్కృతీ చరిత్రచూసినా మనకో సంగతి తేటతెల్లమవుతుంది. భాష సంఘంలోనే పుడుతుంది. సామూహికంగానే పెంపొందుతుంది. అనంతమైన సామూహికశక్తిద్వారానే మన ఇతిహాసాలు గాఢత్వాన్ని, సాటిలేని రామణీయకతను సంతరించుకున్నాయి. వాటిల్లో భాష, భావం పడుగుపేకల్లా కలిసిపోయాయి. ఉమ్మడి ఆలోచనవల్లనే ఈ కలయిక సాధ్యపడింది. ఇతిహాసానికి బాహ్యరూపం చాలా ప్రధానం. మాట చిహ్నంలాంటిది. అంటే మనుషుల మనసుల్లోని ఊహలకు చిత్రాలకు, భావాలకు అక్షరరూపం. ఈరకమైన రూపకల్పనకు ఉదాహరణగా గాలికి

రెక్కలు (అంజనేయుడు) తొడగడం పేర్కొనవచ్చు. మానవుడు ఏనాటి నుంచో పక్షుల్లాగా ఎగరాలని కలలుగన్నాడు. జనం అంతా కలిసికట్టుగా ఆలోచించడంవల్లనే సర్వశక్తి సంపన్నులయిన (భీముడు, బకాసురుడు, జరాసంధుడు, కీచకుడు, సుయోధనుడు లాంటి) పాత్రలను సృష్టించగలిగారు. జనం అంతా కలిసి సృష్టించిందికనుకనే 'ఇలియడ్' (పాశ్చాత్యుల మహాభారతం) లాంటి ఇతిహాసం ఆతర్వాత మరిరాలేదు.

అయితే ఈ ఇతిహాసాల సృష్టిగురించి మనకు నికరంగా సొంతంగా తెలియదు. కాని దానిలోని పాత్రలను పరిశీలించితే అది ఏ ఒక్కరోజులోనో, ఏడాదిలోనో, ఎవరో ఒకరు రాసిన కావ్యంకాదని, జనం కొన్ని యుగాలపాటు సృష్టించిన ఇతిహాసమని తేలిగ్గా తెలుసుకోవచ్చు.

ఆదిమతెగ బ్రతుకుకోసం ఎలా పెనుగులాడిందో చూద్దాం. మనుషులు చిన్న తెగగా అడవిలో క్రూరమృగాలమధ్య మసిలేవాళ్ళు. ముఠా అంతా కలిసికట్టుగావుండేది. ఒకరి ఆంతరంగిక జీవితం, ఆలోచనలు, అనుభూతులు ముఠాలో అందరికీ తెలిసేవి. ఎలాంటి దాపరికాలు, దాగుడుమూతలు లేవు. ప్రతివాడు ఇష్టానుసారంగా ప్రవర్తించేవాడు. ఎలాంటి నియమాలు, నిబంధనలు లేవు చుట్టూరా కనిపించే అడవి, అడవి మృగాలు, సముద్రం, ఆకాశం, రాత్రింబగళ్ళు ఇలాంటివాటిని చూసి బెదిరిపోయి కలలుకని నోటికొచ్చినట్టు మాట్లాడి కల్పనల్లో తేలిపోయేవాడు. ఇలాగే ఒక్కరి అనుభూతులు, అనుభవాలు అందరికీచెందేవి. అలాగే అందరి అనుభవాలు, అనుభూతులు ప్రతి ఒక్కడూ పలవరించేవాడు.

ఒక ముఠాయొక్క భౌతికశక్తికి, జ్ఞానానికి వ్యక్తి అవతారరూపం. మనిషిని మెకం చంపితేనో, అతనిమీద పిడుగు పడితేనో, చెట్టుగట్టు కూలిపడితేనో, ఏట్లో మునిగిపోతేనో కంటికి కనిపించని పగవారెవరో పొట్టనపెట్టుకున్నారని అనుకునేవారు. తెగ బాధపడిపోయేవారు. అంతేకాదు ఆ శత్రుమూకలనుంచి తమను తాము రక్షించుకోవాలని, ముందు ముందు ఇలాంటివి జరక్కుండా జాగ్రత్తపడాలని, తమ శక్తిసంపదలను పెంపొందించుకోవాలని, చావునుంచి దెబ్బకాచుకోవాలని, శత్రువులమీద పగ తీర్చుకోవాలని కోరుకునేవారు. తమలో ఏ ఒక్కడు చనిపోయినా వాడిని తిరిగి బ్రతికించుకోవాలని తపించేవారు. శవానికి దహనక్రియలు జరిగేటప్పుడు వ్యక్తికి అపారమైన శక్తులు ఆపాదించుకుని సంతృప్తిచెందేవారు. అలాంటి శక్తిసంపన్నుడైన వ్యక్తే తమను శత్రుమూకలనుంచి రక్షిస్తాడని కలలుకనేవారు. మనిషి తనలోతాను ఎప్పుడూ కుంచించుకుపోయేవాడు కాదు. కష్టం వచ్చినా, సుఖం వచ్చినా పదిమందితో పంచుకునేవాడు. అనాదికాలంలో వీరాధివీరులను ఇలాగే రూపకల్పన చేశారు. చావునుంచి

రక్షించుకోవాలనేది చాల ముఖ్యమైన కోరిక. అందుకనే ఒకో తెగకు ఒకో వీరుడుండే వాడు. కొన్ని కుటుంబాలు కలిసి ఒక తెగగా ఏర్పడేవి.

వీరుడిని సృష్టించుకుని వాడి బలపరాక్రమాలు చూసి ఉప్పొంగి పోయేవారు. వాడే తమను ఉద్ధరిస్తాడని, కాపాడతాడని కలలుకనేవారు. మనుషులు తమలోతాము పోట్లాడుకుని దేవతలతో పోట్లాడి శ్రీమహావిష్ణువుని అవతారపురుషుడిని చేశారు.

జనాభా పెరిగినకొద్దీ కుటుంబాలమధ్య యుద్ధాలు తప్పనిసరి అయ్యాయి. మీరు మేము అంటూ రకరకాల తెగలమధ్య విరోధాలు పొడసూపాయి. పనివిభజన మొద లయింది. సమిష్టిజీవితం స్థానాన్ని వ్యష్టిజీవితం ఆక్రమించింది. ఉమ్మడి తత్వం పోయి ఏకాకితనం ప్రవేశించింది. వీరుడు స్థానంలో నాయకుడు వెలిశాడు నాయకుడు వెలిసినా తండాగా బ్రతికే అవసరాన్ని అంతా గుర్తించారు. మొదట్లో నాయకుడు సంఘంచేతిలో ఒక పనిముట్టు. తనకు పురమాయించిన పనులను చక్కబెట్టేవాడు. ఆ తరవాత నేర్పు, చొరవ అలవర్చుకుని అందరి అనుభవాలనుంచి తను లాభంపొంది తెగనుంచి దూరంగా జరిగి ఓ కొత్తరకం ప్రత్యేకతను రూపొందించుకున్నాడు.

ఈ దశలోనే వ్యక్తిత్వం పెంపొంది వ్యక్తివాదం (individualism) మొద లయింది.

తండాలో అగ్రతాంబూలం అందుకుంటూ తన శక్తియుక్తులు పెంచుకుంటున్నాడే కాని వ్యక్తి ఏ తెగకు సొంతం దూరంకాలేదు. తెగకూడా తనలో భాగంగానే భావించి వ్యక్తిని బాగా పెంచింది. కావాలని అతన్ని పొగిడింది. ఇతిహాసాల్లోని వీరాధివీరులు మన నాయకుడి కళ్ళముందు కదిలారు. అలాగే తెగకళ్ళకు నాయకుడు గొప్పగా కని పించాడు. నాయకుడు తెగకు చాలా అవసరం. అతని పేరుమీద తెగ బలపరాక్రమాలు పెంపొందించుకుని శత్రువుల నుంచి కాపాడుకునేది. తరువాత్తరువాత కత్తులు, కటారులు, కోటగోడలు, కందకాలు రక్షణలో ప్రముఖపాత్ర వహించాయి.

నాయకుడు నిరంకుశుడుగా మారడంచూసి అతన్ని తెగనాడ్డం మొదలెట్టింది తెగ. అందుకనే మన ప్రాచీన గ్రంథాల్లోను, పిట్టకథల్లోను, మూఢనమ్మకాల్లోను మనిషి దాతకానితనాన్ని గురించి బోలెడు సూక్తులు దొరుకుతాయి. అంతేగాక ఒంటరి గాడిని ఎగతాళి చేయడం, పదవీ వ్యామోహాన్ని తూర్పార పట్టడం ఇలాంటివెన్నో చూస్తాం. పౌరుషం, పొందులాభంలాంటి నానుడులెన్నో మనకు జానపద సాహి త్యంలో దొరుకుతాయి. వీటన్నిటినిబట్టి మనకు సామూహికతత్వం దాని విలువ కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి. ఉమ్మడికృషిని పొగిడేవాళ్లు. ఒంటరిగా పాటుపడితే గేలి చేసేవాళ్లు.

నాయకులతోపాటు ఈర్ష్యలు, స్పర్థలుకూడా పెరిగాయి. అధికారదాహం ఎక్కువయింది. తెగలో కట్టడి కరువయింది. తెగలు ఛిన్నాభిన్నం అయ్యాయి. ఎవరికివారే యమునాతీరే అయారు. స్వార్థపరత్వం పెచ్చుపెరిగిపోయిన వ్యక్తి తెగకు దూరమయి సొంతం మడిగట్టుకు కూర్చున్నాడు. జనం ఎలాపోతే మనకేమని ఎప్పుడయితే వ్యక్తులనుకున్నారో, అప్పుడు జనంకూడా వ్యక్తులను గురించి పట్టించుకోలేదు. అప్పుడు వ్యక్తికి నేను, నా ఆస్తి, నా హోదా, నా ఇల్లు, నా పెళ్లాం పిల్లలు అని తాపత్రియం ఎక్కువైంది. శ్లేష్మంలోపడ్డ ఈగలాగా కొట్టుకోవడం మొదలెట్టాడు. వ్యక్తి కేవలం స్వార్థపరుడు కావడంతో సంఘంనుంచి సొంతం దూరమయాడు. వ్యక్తివాదానికి, అరాజకత్వానికి ఇదే నాంది. చరిత్రలో మనకు కళ్ళకు కట్టినట్టు కనిపిస్తుంది.

తెగలను ఛిన్నాభిన్నంచేసి వ్యక్తి అహంకారానికి ఆకారం కల్పించడంతో స్వంత ఆస్తి ఎలాంటి పాత్రి నిర్వహించిందో మనందరికీ తెలుసు. దీనివల్ల మనుషులు కేవలం శారీరకంగా, మానసికంగా బానిసలుగా తయారుకావడమే కాకుండా, జనంలో ధైర్యసాహసాలు, సృజనాత్మకశక్తి, కళాదృష్టికూడా గుంటపెట్టి గంటవాయించాయి–కరువయ్యాయి.

మానసికంగా సంకెళ్లుపడ్డ జనం అదివరకటిలాగా ఇతిహాసాలు సృష్టించలేకపోయినా వారి మనోవేదనలను పిట్టకథలుగా, పాటలుగా, నానుడులుగా అల్లారు. జానపద సాహిత్యం ఓ తరగని గని అందులో కవితాసూక్తులు, చిత్రాలు, రీతులు కోకొల్లలు. వీటన్నిటిని ప్రపంచంలోని మహాకవులంతా తమ ఉత్తమ కావ్యాల్లో వాడుకున్నారు.

అనుమానస్థుడు ఒథెల్లో, ఊగిసలాడే హామ్లెట్, తిరుగుబోతు డాన్‌జుఆన్ ఈ పాత్రిలన్నీ షేక్స్పియర్‌కన్నా, బైరన్‌కన్నా చాలా ముందుగానే ప్రజలు సృష్టించారు. డాన్‌క్విక్ జాట్‌లాంటి ఉత్తుత్తి వీరులను సెర్‌వాన్‌టిజ్‌కన్నా చాలా ముందుగానే పిట్టకథల్లో ఎగతాళి పట్టించారు.

అగాధమైన, అనంతమైన ప్రజాకవిత్వంనుంచి ప్రేరణ పొంది, సంఘంయొక్క సృజనాత్మక శక్తినుంచి తెచ్చుకున్న రెక్కలు తొడుక్కొని మిల్టన్, డాంటే, గొథే మొదలైనవాళ్లు మహోన్నత శిఖరాలు చేరుకున్నారు.

ఇలా చెబుతున్నానంటే మహాకవులను తక్కువ చేయాలని నా ఉద్దేశం కాదు. కాని కవులు కంఠహారాలు తయారుచేస్తే ఆ హారాల్లోని మణులు, మాణిక్యాలుమాత్రిం జనసామాన్యమే కలిసికట్టుగా సృష్టిస్తారు. కళలో వ్యక్తికి చాతుర్యం వుండవచ్చు. కాని సృష్టికర్తలు మాత్రిం ప్రజలే.

సంఘానికి దూరమైనవ్యక్తి ఛాందసుడుగా, అభివృద్ధి నిరోధకుడిలా మిగిలి పోతాడు.

సాంస్కృతిక చరిత్రను ఈ దృష్టినుండిచూసి మనం వ్యష్టివాదం నిర్వహించిన పాత్రను పరిశీలించవచ్చు. చరిత్ర మందకొడిగా నడిచినప్పుడు, చురుగ్గా సాగినప్పుడు కూడా ముఖ్యంగా రినైజాన్స్, రిఫర్మేషన్ రోజుల్లో వ్యష్టివాదం ఛాందసానికి, నిరాశావాదానికి, శూన్యవాదానికి, రెట్టమతానికి దారితీసింది- చరిత్రగమనంలో ఎప్పుడూ జనమే మానవుడిని మూసపోశారు.

రినైజాన్సురోజుల్లో ప్రజలు కళను పట్టించుకునేవారు. ప్రజలకోసమే కళపుందేది. పైగా కళలో ప్రజలు తమ కాయకష్టాన్ని కరిగించి పోయడమేగాక తమ అజరామర అమాయక హృదయాలను అందులో లీనం చేశారు.

కాలం గడిచినకొద్దీ మనిషికీ మనిషికీ మధ్య దారుణ, మారణ సంఘర్షణ మొదలయింది ఈ సంఘర్షణ అనే గుండిగలో ఉడికి మనిషి మరింత స్వార్థపరుడయాడు.

ప్రజలసాయంతోనే బూర్జువాలు జమీందారులను ఓడించారు. తరువాత జనం తమ బతుకులకు ఆసరా చూపించమని అడిగే సరికి కర్కశులైపోయారు. అంతటితో ఆగలేదు. స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వంఅనే నినాదాలకు తిలోదకాలిచ్చి జనానికి సంకెళ్లు తగిలించారు. అందువల్ల బూర్జువాలెప్పుడూ నీతికి, న్యాయానికి కట్టుబడరు. తమ పచ్చ తమ ఎచ్చ చూసుకుంటారు. ఇప్పుడు రాజ్యం బూర్జువాలదే, కొండకొమ్మున కూర్చున్నారు,

బూర్జువాలు గద్దెకెక్కిన చావు తెలివితేటలు అలవరుచుకున్నారు. రచయితలకు మెత్తమెత్తగా తియ్యటి కబుర్లు చెప్పి వాస్తవ పరిస్థితుల నుంచి వారిదృష్టి మరలించాలని చూస్తారు. కాని రచయితలకు కావలసింది ప్రజల శ్రేయస్సు, సౌభాగ్యం, ప్రజలు ఆరోగ్యంగా, హాయిగా, ఆనందంగా వున్నప్పుడే రచయితకు విశ్రాంతి.

విశ్వంలో మానవుడు మహోన్నత సృష్టి. విశ్వరహస్యాలను తెలుసుకుని, ప్రకృతి శక్తులను జయించి ప్రపంచాన్ని సమాజాన్ని నందనవనంగా మార్చటమే మన ధ్యేయం.

అనువాదం: సి. ప్రసాద్

## స్త్రీ పురుష సంబంధాల గురించి లెనిన్

ప్రజానీకంలోని ప్రతివ్యక్తి తనశక్తినంతా ఉపయోగించి కష్టపడాలని విప్లవం కోరుతుంది. సెక్సువిషయాల్లో విశృంఖలత్వం బూర్జువాలక్షణం. అది పతనానికి చిహ్నం. శ్రామికవర్గం పురోగమించేవర్గం. మైమరచేందుకు మత్తుపదార్థాలు దానికక్కరలేదు. లేనిపోని ఉద్రేకం కొనితెచ్చుకోనేందుకు నిషావస్తువులవసరంలేదు. సెక్సు విశృంఖలంద్వారా నిషాగాని మత్తుగాని అక్కరలేదు. పెట్టుబడిదారీ విధానంలోని నైచ్యాన్ని, కల్మషాన్ని కర్కశత్వాన్ని మరచిపోవటానికి కార్మికవర్గం యిష్టపడదు. సహించదు. శ్రామికవర్గం తన వర్గస్థితినుండి కమ్యూనిజం ఆశయంనుండి బలీయమైన ప్రేరణను పొందుతుంది. దానికి కావలసిందల్లా స్పష్టత. స్పష్టత మరొకసారిస్పష్టత. అందుచేత మనలో బలహీనత పనికిరాదని, మనం శక్తిని వృధాచేయకూడదని, తిరిగి నేను చెబుతున్నాను.

ఆత్మనిగ్రహం, స్వయంశిక్షణ దాస్యంకావు. అవి ప్రేమకుకూడా అవసరమే. బూర్జువా సమాజంలోని హానికర విషయాలు పనికిమాలిన కలుపు మొక్కలు, విప్లవశక్తులకుకూడా వ్యాపించటం ప్రారంభమైతే వాటిని సకాలంలో ఎదుర్కోవటం అవసరం.

తాగటం వ్యక్తిగత విషయం. కాని ప్రేమించటం అలా కాదు. ఇందులో యిద్దరు భాగస్తులుంటారు. ఫలితంగా మూడవప్రాణం జనిస్తుంది. నూతన జీవితం ఆవిర్భవిస్తుంది. కాబట్టి యిందులో ఒక సామాజిక పరమార్థం యిమిడివుంది. సమిష్టి సంస్థఅయిన సమాజంపట్ల ప్రతివ్యక్తి కొన్ని విధులు నిర్వర్తించవలసిన అవసరం కలుగుతోంది.

సెక్సు జీవితంలో ద్యోతకమయేది కేవలం ప్రకృతి ప్రసాదించినదే కాదు. అది సంస్కృతినుండి- ఉన్నత సంస్కృతికావచ్చు, నీచ సంస్కృతి కావచ్చు- ఆవిర్భవించిన సమ్మిశ్రణకూడా,

"స్త్రీ పురుషులమధ్య సెక్సు సంబంధాలు కేవలం సమాజ ఆర్థిక పరిస్థితులకు, శారీరక కామవాంఛలకు మధ్యజరిగే ఆటకాదు. సెక్సు సంబంధాల్లో వచ్చే మార్పులను మొత్తం సిద్ధాంతరంగంలో వాటికిగల సంబంధాన్నించి దూరంచేసి, సూటిగా ఆర్థిక పునాదిలో వచ్చే మార్పులపైన అవి ఆధారపడి వుంటయ్యనటం మార్క్సిజం కాజాలదు."

జనచైనా ఒక దేశంమాత్రమే కాదు.

## ఒక ఆలోచన ఒక ఆదర్శం

ప్రపంచమంతటా ఎక్కడజూస్తే అక్కడ. ఎప్పుడుబడితే అప్పుడు గోడలమీద. మేడలమీద. బోర్డులుకట్టి రోడ్లకువేసీ. స్లైడులుగానూ. టెలివిజన్‌లో సినిమాల్లో పత్రికలలో ఎక్కడజూస్తే అక్కడ కన్నుతెరిస్తే కనిపించేట్టుగ ప్రత్యక్షమయే వినాదాలు, నినాదాలు.

కోకాకోలా తాగండి!, యీ సినిమాచూడండి, యీ మిల్లుబట్టలు ఫ్యాషనువి, యీ టూత్‌పేష్ట్ ఆరోగ్యం, యీ నాయకుడికి ఓటెయ్యండి, వగైరా వగైరాలు.

హాంకాంగ్‌నుంచి సరిహద్దుదాటి చైనాలో అడుగుబెడితే- అది మరో ప్రపంచం. వేరేప్రపంచం. రష్యా తూర్పు యూరప్ కమ్యూనిస్టు రాజ్యాలతో సహా యావత్ ప్రపంచమూ ఒకరకంగా కనిపిస్తే చైనాలో అడుగుబెట్టగానే కొత్త ప్రపంచంలోకి అడుగుపెట్టినట్లే అనిపిస్తుంది.

ఇక్కడకూడా అక్కడక్కడా నినాదాలు విన్పిస్తయ్. కుంభంగా క్రమపద్ధతిలో వినాదాలు రాశారు.

"ప్రజలకు సేవజేయండి"

"ధైర్యంచేసి ఆలోచించండి"

"కార్యాచరణకు ధైర్యంచేయండి"

"బూర్జువా ఆలోచనా విధానాన్ని తుడిచేయండి"

"శ్రామిక ఆలోచనా విధానాన్ని పెంపొందించండి"

ఒక ఫ్యాక్టరీలోని యువకార్మికుల గ్రూపులో మాట్లాడుతూ అడిగాను. "బూర్జువా ఆలోచనా విధానాన్ని తుడిచేయటం అంటే ఏమిటి?"

చైనాభాషలో వారిలోవారు ఒకనిమిషం చర్చించారు. ఒకతనుఅన్నాడు "బూర్జువావలె ఆలోచించటం మానెయ్యాలి" అని

"మళ్ళీ అదీ అట్లనేవుందికదా, మీరు చెప్పిందానివల్ల కొత్తగా ఏమీ బోధపడటంలేదు. బూర్జువా ఆలోచనఅంటే క్లుప్తంలో సూటిగా మీరనుకొనేది ఏమిటి?"

ఈసారి ఏమీ చర్చ జరగలేదు. ఏకగ్రీవంగా ఒకేమాటలో జవాబు వచ్చింది.

"స్వార్థం"

అంటే తర్వాతి నినాదం, శ్రామిక ఆలోచనావిధానాన్ని పెంపొందించు కోవటం అంటే నిస్వార్థంగా ఆలోచించడం అయుంటుందని మనకు తెలిసి పోతుంది.

అంటే యీ నినాదాలు మామూలుమాటల్లో చెప్పాలంటే వాటిసారం. "స్వంతంగురించి ఆలోచించటం మర్చిపో, ఇతరుల క్షేమంగురించి సంఘం గురించి ఆలోచించు".

1967 సాంస్కృతిక విప్లవ తీవ్రదశలో మావో యిచ్చిన ఒకనినాదం "అహంతోటి పోరాడు, స్వార్థంతోటి పోరాడు, రివిజనిజాన్ని తిరస్కరించు".

ఈ నినాదాలకు అడుగున సమాజమంతటా అన్నిమూలలా జరుగు తున్న లోతైన పరిశీలన, వున్నతమైన విద్యాబోధవుంది.

ఈ విద్య పసిపాపలవద్దనుండి ఆరంభమవుతుంది. స్వయం సహాయం, స్వంతకాళ్ళమీద నిలబడటం బాలలతోసహా అందరూ నేర్చుకుంటున్నారు. అంతే కాదు. వీటికి సరైన జతగా ఇతరులకు సాయపడటం, పరస్పర సహా యం నేర్చుకుంటున్నారు. ఈ విద్య నేర్చుకోవటం ఒకచోట ఒకదశలో జరిగి యింకోచోట యింకోదశలో ఆగిపోయేదికాదు. జీవితపు సర్వదశల్లో జరుగు తుంది. ఇదేదో బోధగా ప్రవచనాలుగా జరగదు, లెక్చర్లు దంచటంగా ఉప

దేశాలుగా వుండదు. జీవితంనుండి జీవితానుభవంనుండి ఒకరికొకరు నేర్పు కొనటం, నేర్చుకొనటంగా జరుగుతుంది.

పాత సమాజ విలువలను నీతులనూ అన్నిటినీ తుడిచేస్తూ కొత్త విలువలను సరికొత్త మానవసంబంధాలను మానవతా నీతులను అలవర్చుకొంటున్నారు. మనిషి స్వంతంకోసం అనేదికాక, సమిష్టికోసం వ్యక్తి, వ్యక్తికొరకు సమిష్టిఅనే సామూహిక దృష్టితో నడవడిని, విలువలను, పద్ధతులను రూపొందించుకొంటున్నారు.

లక్షలాది ప్రజలతో కిటకిటలాడుతూకూడా శుభ్రంగా చక్కగా మానవత్వంతో తొణికిసలాడుతున్న మహాషాంగై నగరాన్ని చూచేవరకూ, నేను కలకత్తాలాంటి మహానగరాల్నిచూచి యిలాంటి మహా నగరాలను బాగుచేయటం అసాధ్యంగా భావించేవాడను.

తమ విజయాలు ప్రారంభాలుమాత్రమేనని, తాము సరైన దారిలో వున్నామని, ఒకనాటికి ప్రపంచముకంతకూ యీ విజయాలు మార్గదర్శక మవుతాయని చైనీయుల దృఢ విశ్వాసం.

ఇలాంటి దృశ్యాలు మాటలగురించి యితర ప్రపంచానికి ఒక అభిప్రాయంవుంది. లోగడ ఒకపుడు రష్యానిగురించి యిట్లనే చెప్పిరను. ఇట్లనే భూతలస్వర్గం అన్నరు. ఇపుడది ఏమైంది? విఫలంకాలేదా? అమాటలన్నీ వట్టినే చెప్పినవిగా తేలిపోలేదా అని. అదినిజమే. అ సందేహం సహేతుకమే. రష్యా విఫలమైంది గనక రష్యా విప్లవం తిరోగమనం పాలయిందిగనక యీ సంశయాలు సహజమే. కాని మనం ఆలోచించాల్సింది- ఒక విప్లవం విఫలమైందిగనక, వంద విప్లవాలు విఫలమయాయిగనక అన్ని విప్లవాలూ విఫలమే అయితీరుతవి అని అనుకోవాల్నా? చైనీయులు రష్యన్ విప్లవ విఫలాన్నికూడ దృష్టిలోకి తీసుకున్నారు. ప్రతి విప్లవంయొక్క గర్భంలోనూ సహజంగావుండే విద్రోహం అనే బీజాన్ని గుర్తెరిగి వీరోచితంగా ఆ విద్రోహ బీజంపై పోరాడి జయించారు చైనీయులు. అదే సాంస్కృతిక విప్లవం. అదే యిక్కడి విశేషం. ఈ విజయానికి కారణమైన చేతనత్వం దూరదృష్టి చైనా

సమాజంలో నేడు నరనరానా ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. ఈ చేతనత్వం దూరదృష్టి, పైనించి అందిస్తేనో వత్తిడిచేస్తేనో వచ్చిందికాదు. ప్రజలమధ్య నించి ప్రజలలోనుండే ఉద్భవించుతున్న చైతన్యమది. చైనానడుస్తోంది. ఒకరుతోలితే నడవటంకాదు. ప్రజ తమకుతామే నడుస్తోంది.

నేడు చైనాలో జరుగుతున్నది నిర్బంధంతోకూడిన అభివృద్ధికాదు. చక్కని బృందగానం. సమిష్టి స్వేచ్ఛాగానం.

[నెవిలీ మాక్స్‌వెల్ ఇంగ్లాండు రచయిత. చైనావెళ్ళి చూచివచ్చి వ్రాసిన వ్యాసం రెండు భాగాలుగా 'ఫ్రాంటియర్' అనే పత్రికలో వచ్చింది. వాటి స్వేచ్ఛా సంక్షిప్తసారం యిది.]

విద్యావేదిక

# సమ సమాజంలో విద్య

## సాంస్కృతిక విప్లవంతరవాత జనచైనాలో విద్యావిధానం

కన్సర్న్డ్ ఏసియన్ స్కాలర్స్ కథనం. *

స్వేచ్ఛానువాదం : రాంప్రసాద్

"నాకు స్కూలుకు వెళ్ళే అవకాశమే లేకపోయింది. నాకు చదువు రాదు. చదువూ సంధ్యా లేకపోతే హక్కులగురించి నోరు మెదపమనీ, వారికి ముప్పుతలపెట్టమనీ అప్పటి పాలకులు మమ్మల్ని నిరక్షరాస్యులుగా వుంచేరు. ప్రజాపరిపాలన వచ్చేక వయోజన అక్షరాస్యతా ఉద్యమంలో నేనుకూడా అక్షరాలు నేర్చుకున్నాను. ఇప్పుడు కొంత కొంతగా పత్రికలు చదివి వార్తలు అర్థంచేసుకోగలను. అయినా వయసుముదిరిపోయేక చదువుకోడం కష్టమే. కాని ఇప్పుడు నా మనవలు, మనవరాళ్లూ అందరూ విద్యార్థులే. నా మనవడొకడు యిప్పుడు యూనివర్సిటీలో చదువుతుంటున్నాడు. మా పరిస్థితి యిప్పుడెంత మారిందో మీరే ఆలోచించండి" హుడాంగ్ కమ్యూన్ గ్రామీణ ప్రాంతంలో ఒక ముసలామె చెప్పినమాటలివి. చైనావారు తమ విద్యావిధానం గురించి

---

* China Inside the People's Republic, by the Committee of Concerned Asian Scholors, Published by Bantom books, 2nd Printing March 1972 Chapter on Education page 197 to 227

ఈ కమిటీలో 15 మంది అమెరికన్ విద్యావేత్తలు, ఉపాధ్యాయులు, విద్యార్థులు వున్నారు. వీరంతా తత్వశాస్త్రం, రాజకీయశాస్త్రం, సామాజిక శాస్త్రం మొదలగు వివిధ విషయాలు అమెరికాలో చదువుతున్నారు. వీళ్ళంతా పాతికలోపునవున్న యువతీ యువకులు. వీరు 1868లో యుద్ధవ్యతిరేకసమాఖ్యగా ఏర్పడ్డవాళ్లు. వీళ్ళు చైనీస్ భాష మాట్లాడగలరు. హాంకాంగ్‌లో కొన్ని నెలలువుండి చైనీస్ భాషలో వివిధమాండలిక బేధాలతోసహా మాటాడ్డం నేర్చుకున్నవారు వీళ్లలో కొందరు 23 జూన్, 1971 నుంచి 24 జులై 1971వరకూ చైనాలో విస్తృతంగా ప్రయాణంచేసి కమ్యూన్లు వగైరా స్వయంగా చూసేరు– వివిధ విషయాలపై వీరు రాసిన వ్యాస సంకలనం యిది–

వివరించేటప్పుడు ప్రస్తుత విధానాన్ని పాతవిధానాలతో పోల్చిచెబుతారు. పాతవిధానం అంటే కేవలం సాంస్కృతిక విప్లవానికి ముందున్నదేకాదు. రెండువేల ఏళ్ళ చైనా నాగరికతా చరిత్ర అంతా యీ'పాత' విధానంలో భాగమే. చైనా చరిత్రలో విద్యకు ఎప్పుడూ కీలకపాత్రవుంది ప్రస్తుతానికీ గతానికీ అదొకటే పోలిక. 1949 విమోచనతో పాత విద్యావిధానం సమూలంగా మారిపోయింది.

పూర్వం చైనాలో విద్య అతికొద్దిమందికి- అదీ భాగ్యవంతులకి దొరికేది. ఇప్పుడది జనబాహుళ్యానికి- ముఖ్యంగా పేదలందరికీ- లభ్యమవుతూంది. పాతసమాజంలో యువకుల్లో అత్యధిక భాగం బతుకుతెరువు కోసం ఏదో ఒక పనిలో చేరాల్సి వుండేది. చదువుకుందికి వారికి తీరిక, డబ్బు వుండేవికావు. అధికారులు భూస్వాములు వర్తకుల పిల్లలు మాత్రమే చదువుకోగలిగేవారు. దీనిఫలితంగా 1949 నాటికి చైనాలో నూటికి ఎనభైమంది నిరక్షరాస్యులుగా మిగిలేరు. వీరంతా బీదలే. ఇప్పుడాస్థితి మారిపోయింది. అక్షరాస్యతా ఉద్యమం దేశవ్యాప్తంగా విజయవంతమయింది. పూర్తిగా వయసు మళ్ళిన కొద్దిమంది వృద్ధులుతప్ప. నేడు చైనాలో అందరూ వార్తాపత్రికలు చదవగలరు. సంపన్నుల పక్షం వహించే విధానం తొలగించి, బీదకార్మిక కర్షకుల పిల్లలకి ప్రోత్సాహసహాయాలు యితోధికంగా కలిగించే నూతన విద్యావిధానం చైనాలో నేడు అమలు చేస్తున్నారు.

పాతవిధానం విద్యార్థుల్ని 'పండితులు'గా (సంకుచిత అర్థంలో) తీర్చిదిద్దేది. ఇలాటి పండితులకు చరిత్రజ్ఞానం, చైనా సాహిత్య కావ్యాల పరిచయం, ప్రకృతిచిత్రలేఖనా ప్రావీణ్యం ఉండవచ్చు. వీరు ప్రభుత్వ ఉద్యోగాలు చేయగలరు. కాని అన్నిటికంటె ముఖ్యమైంది, ఈ పండితులెప్పుడూ బుద్ధిజీవులే తప్ప శ్రమజీవులుకారు. వారి చేతివేళ్ళ పొడుగాటిగోళ్ళే ఈ విషయం చెబుతాయి. ప్రస్తుత చైనా విద్యావిధానం ఈ పాత'పండితుల'కి పూర్తిగా భిన్నమైన విద్యావంతుల్ని తయారుచేస్తుంది. వారికి బతుకులో ఉపయోగపడే పని పాట్లు గురించి బోధిస్తారు. ఆర్థికంగా సాంఘికంగా చైనా అభివృద్ధికి దోహదం చేయగల శిక్షణ వారికి యిస్తున్నారు. ఈ మేధావులు జీవితాన్ని కేవలం లైబ్రరీలలోనే గడపరు; కర్మాగారాల్లోనో వ్యవసాయక్షేత్రాల్లోనో పనిచేస్తారు. ప్రజలు పుస్తకాలనుండిమాత్రమే అన్నివిషయాలూ తెలుసుకోలేరనే మావోసిద్ధాంతాన్ని చైనా విద్యారంగానికి అన్వయించేరు. విద్యార్థులు సిద్ధాంతమేకాక దాని ఆచరణకూడా నేర్చుకుంటున్నారు. ఈ విధంగా విద్యార్థులు స్వయంగా శారీరకశ్రమ చేయడమేకాక, అందువల్ల, శ్రమజీవుల్ని గౌరవించడంకూడా నేర్చుకుంటున్నారు.

పూర్వం విద్యావంతులకే అధికారం, డబ్బూ ఉండేవి. వాళ్ళు ఆ అధికారంతో స్వప్రయోజనాల కనుగుణంగా చైనాపాలన సాగించేరు. ఇప్పటి చైనా నూతన విద్యా విధానం ప్రయోజనం. లక్ష్యం ఇందుకు పూర్తిగా వ్యతిరేకమైనవి. కొద్దిమంది ప్రయోజనాలనుకాక, అందరిక్షేమాన్నీ కాంక్షించి ప్రజలకు సేవచేయగలనాయకుల్ని తయారు చేయడం యీ విధానం లక్ష్యం.

## సాంస్కృతిక విప్లవం :

ఒక యూనివర్శిటీలో మొదలైన సాంస్కృక విప్లవం మొత్తం విద్యావిధానాన్నంతటినీ స్థంభింపజేసింది. 1966లో పాఠశాలలన్నీ మూసేసేరు కొన్ని యూనివర్శిటీలు యింకా తెరవనేలేదు. సాంస్కృతిక విప్లవం అంతటిలో విద్యావిధానం లక్ష్యాలపై సర్వజనీనమైన అంగీకారంవుంది. ఆర్థిక సాంఘిక రంగాలలో చైనా ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారానికి అవసరమైన శిక్షణ యివ్వడం, స్వలాభాపేక్షకాక ప్రజలందరికీ సేవచెయ్యాలనే దృక్పథం పెంపొందించడం, బీద కార్మిక కర్షకుల పిల్లలందరి కోసం విద్యావకాశాల్ని విస్తృతం చేయడం ఇవీ ఆ లక్ష్యాలు.

అందుకనే సాంస్కృతిక విప్లవ సందర్భంలో జరిగిన వాదోపవాదాలు లక్ష్యాల గురించికాక వాటి సాధనకనువైన మార్గాల గురించి తీవ్రంగా చర్చించేయి. ఆచరణతో సంబంధంలేకుండా కేవలం బుద్ధిగత సిద్ధాంతవేత్తలుగా విద్యావంతులను- ఒక ప్రత్యేక వర్గంగా— విద్యాలయాధికారులు తయారు చేస్తున్నారని రెడ్‌గార్డులు ఆరోపించారు. విద్యార్థులు ఏమాత్రం శారీరకశ్రమ చేయడంలేదనీ అందువల్ల తాము సేవించవలసిన శ్రామిక ప్రజలనుండి వారు దూరమైపోతున్నారనీ రెడ్‌గార్డులు భావించేరు. అన్నిటికంటె ముఖ్యంగా యీ విధానం విద్యార్థుల్ని బూర్జువా విలువల మత్తులో— అంటే స్వలాభం, స్వసౌఖ్యం, స్వీయగౌరవం మిన్నగా ఎంచుకుని, దేశంపట్ల సమాజంపట్ల నిజమైన ప్రేమ, సేవాభావం లేకపోవడంలో- ముంచుతున్నదని వీరి ఆరోపణ.

చైనాలో మేధావులు ఎలాటివారు కాకూడదని రెడ్‌గార్డులు భావింవారంటే, పూర్వపు "మూడుద్వారాల విద్యావేత్తలు" అందుకు సిసలైన ఉదాహరణ. వారు జీవితంలో మూడు ద్వారాలుమాత్రమే దాటుతారు; ఇంటినుంచి బడికి. బడినుంచి యూనివర్శిటీకి, అక్కడనుంచి ఉద్యోగానికి. వీరు బతుకునుంచి దూరంగా, కేవలంపుస్తకాల చదువుల్లో పద్దెనిమిదేళ్ళుగడిపి, ఉత్పత్తికి ఏవిధంగానూ ఉపయోగపడకుండా సమాజానికి బరువుగా పరాన్నభుక్కులవుతారని రెడ్‌గార్డ్‌ల అభిప్రాయం.

విద్యార్థుల జీవితంలో సాంస్కృతిక విప్లవానికి సార్థకత ఏమిటి ? పాఠశాలల్ని సమూలంగా మార్చివేసేరా ? చైనా పిల్లలు, యువజనులు ఎలా వుంటారు ?

## రాజకీయాలు... పింగ్-పాంగ్... తుపాకులు :

అన్ని దేశాలలోవలెనే చైనాలోకూడా పిల్లలు విదేశీయులపట్ల కుతూహలంగా ఉంటారు. చిరునవ్వులందించడానికీ స్నేహంగా మసలడానికీ సంకోచించరు. చిన్న పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉంటారు.

చైనాలో పిల్లలు ఆటలలో హుషారుగా పాల్గొంటారు. ఆరోగ్యంగురించి అక్కడ ఎక్కువ శ్రద్ధ వహిస్తారు. ఉదయాన్నే పెద్దలుకూడా వ్యాయామం చేయడం సర్వ సాధారణంగా కనుపిస్తుంది. ప్రతి స్కూల్లోను పటిష్ఠమైన వ్యాయామ కార్యక్రమా లుంటాయి. అక్కడ యువజనులందరికీ బాస్కెట్‌బాల్, పింగ్-పాంగ్, అంత ఎక్కువ ఇష్టం. పింగ్-పాంగ్ బేట్లు పట్టుకుని హుషారుగా పోయేవారు వీధుల్లో తరచుగా ఎదురౌతారు. మారుమూల కమ్యూనుల్లోకూడా, ఎత్తైన యిటికల అరుగుల మీద పింగ్-పాంగ్ నెట్లు కట్టివుంటాయి.

చైనా పిల్లలకి మిగతా దేశాలవారితో పోలికతోపాటు తేడాలూ ఉన్నాయి. కొద్ది కాలం కిందటే భూస్వామ్య సమాజంనుండి విముక్తమైన విప్లవ సమాజంలో పెరుగు తున్నారు వీళ్లు. విమోచనానంతరం పుట్టిన కొత్తతరం పిల్లలందరికీ గత చరిత్ర, ఆ సమాజపు విలువలు దాని చారిత్రిక అవసరాలగురించి తెలియచెబుతారు. గత సమాజం గురించి తెలుసుకోవడం చిన్నపిల్లల చదువులో ఒక ముఖ్యభాగం. ఇళ్లవద్ద ముసలాళ్లు తినడానికి తిండికూడా సరిగా దొరకని పాత గడ్డురోజుల గురించి పిల్లలకు చెబుతుం టారు. స్కూళ్ళలో పిల్లలు గతకాలపు చేదుజ్ఞాపకాల కథలూ గాథలూ వింటారు. ఈ యువకులకు నమ్మశక్యంకానట్టు కనుపించే గత సమాజం గురించి వారు సాంస్కృతిక కార్యక్రమాలు. ఫోటో ప్రదర్శనలు, శిల్పాలు, పాటలు మొదలైన అన్నిటిద్వారా తెల్పుతుంటారు.

పాత సమాజం ఎన్నాళ్ళకిందటో అంతరించిపోయినట్టనిపించినా దాన్ని మార్చ డానికి జరిగిన పోరాటాల చైతన్యం మాత్రం వాస్తవంలాగ అనుభవంలోకి వస్తుంది. ఆ పోరాటాల సారాంశమైన తత్వాన్ని పిల్లలు వంటబట్టించుకుంటారు. స్వార్థత్యాగం, కార్మిక కర్షకులపట్ల గౌరవం, కష్టాలను ఎదుర్కొనే ఆత్మస్థైర్యం— ఇవన్నీ అలవాటు చేసుకుంటారు. గతసమాజాన్ని సమూలంగా మార్చిన నాయకుడుగా మావ్-సే-టుంగ్ పిల్లలందరికీ ఆలోచనల్లోను, ఆచరణలోనుకూడా ఆదర్శం. ఆయన ఆలోచనల్ని అధ్యయనంచేస్తూ వాటిని ఆచరణలో పెట్టడానికి నిత్యం ప్రయత్నిస్తుంటారు.

చైనా పిల్లల బాధ్యతలు పాశ్చాత్యుల దృష్టిలో చాలా ప్రమాదకరమైనవి, కష్ట భరితమైనవి అనిపించవచ్చు. చైనా పారిశ్రామికీకరణ గురించి అర్థం చేసుకునేందుకు, వారు శారీరకశ్రమ చేస్తారు. దేశరక్షణనిమిత్తం ప్రజాబలగంలో (People's Militri) చేరుతారు. నాన్‌కింగ్‌లో స్థానిక ప్రజాబలగం కవాతు చేస్తుండగా చూసేం. ఆడ, మగా, చిన్నపిల్లలు యువజనులు అందరూ అందులో పాల్గొన్నారు. చిన్నచెడ్డీలు, పొడ వాటి అద్దకం గౌన్లువేసుకున్న ఆడపిల్లలు నవ్వుతూ చాలా సంతోషంగా వున్నారు. తుపాకీ గురినేర్పడానికి దూరంలో పొడుగాటి దండేలకి మెరుస్తున్న ఎర్రటి లక్ష్యాలు వేలాడదీసేరు. చిన్నపిల్లల్ని కూడా ఈ దళాల్లో ఎందుకు చేర్చేరని వాళ్ళ నాయకుణ్ణి అడిగేం.

"చైనా సర్వసిద్ధంగా ఉండాలి; ప్రజాయుద్ధంద్వారానే చైనా ఐక్యం కాగలిగింది" అన్నాడతను. ఆ విమోచన పోరాటంలో సమాజంలో అందర్నీ సమీకరించవలసి వచ్చింది. ప్రస్తుతం రష్యానుంచి, చుట్టూతా ఉన్న అనేక అమెరికన్ స్థావరాలనుంచి యుద్ధప్రమాదం ఉందని చైనా నాయకులు భావిస్తున్నారు. అందుకనే పిల్లలు అన్ని సమయాలకీ పనికివచ్చే శిక్షణ పొందుతున్నారు. వాళ్లు ఫ్యాక్టరీల్లో పనిచేస్తారు, వ్యవసాయ కమ్యూన్లలో సాయపడతారు; రైఫిళ్లు పట్టడంకూడా నేర్చుకుంటారు.

## చెంగ్జియాన్ రోడ్ ప్రాథమిక పాఠశాల :

ఒకరోజు ఉదయం నాన్‌కింగ్‌లో చెంగ్జియాన్‌రోడ్ ప్రైమరీ స్కూలుకు వెళ్లాం. మట్టిరంగు యిటికల్తో కట్టిన సాధారణమైన ఇళ్ళు అవి. ఇటీవలే కట్టినట్టున్నారు. మమ్మల్నో పెద్దగదికి తీసుకువెళ్లేరు. అక్కడ ఆ స్కూలు నిర్వహణను పర్యవేక్షించే విప్లవ కమిటీ సభ్యుల్ని కల్సుకున్నాం. ఆ స్కూలు సంక్షిప్త చరిత్ర, దాని బోధనా కార్యక్రమం గురించి వారు క్లుప్తంగా చెప్పేరు. ఆ బడి ప్రాథమిక పాఠశాలలన్నిట్లో ఉత్తమమైందికాదుగాని, మామూలుకంటె మంచి ప్రమాణంలోనే నడుస్తూందని వారు చెప్పేరు. క్లాసురూములు వర్క్‌షాపులు చూపించడానికి నలుగురు టీచర్లు మాతో వచ్చేరు. అందులో ఒకాయనకు నలభైయేళ్లుంటాయి. మిగతా ముగ్గురూ అంతకన్న తక్కువ వయస్సులోవున్న స్త్రీలు.

క్లాసు గదులు మామూలు సైజులో పెద్దపెద్ద కిటికీలతో విశాలంగానే ఉన్నాయి. ఈ స్కూల్లో ఏడునుంచి పదమూడు సం॥ల వయసు పిల్లలు ఒకటినుంచి ఆరు తరగతులు చదువుతున్నారు. ముందున రాతబల్లలున్న బెంచీలమీద పిల్లలు రెండువరసల్లో

కూచున్నారు. టీచర్లు, స్థలమూ తక్కువకావడంతో ప్రతి తరగతిలోనూ నలభైమంది పిల్లలున్నారు. క్లాసురూం వాతావరణం చాలా క్రమబద్ధంగావుంది. చేతులు కట్టుకు కూచున్న పిల్లలు మేం క్లాసులోకి వెళ్ళగానే చప్పట్లుచరిచారు. టీచరు వాళ్లను ఊరుకోమని చెప్పి ఇంగ్లీషు పాఠం ప్రారంభించింది. స్వచ్ఛమైన బ్రిటీషు పలుకుబడితో "సన్‌ఫ్లవర్" అంది టీచర్. పిల్లలంతా పునశ్చరణచేసేరు అలా వాక్యంలో ఒక్కొక్కటే అన్ని మాటలూ చెప్పినతరవాత పిల్లలు వాక్యమంతా చదివేరు. మేముచూసిన క్లాసులన్నిటా పాఠాలు యిలాగే సాగేయి. టీచరు పాఠం చెబుతే పిల్లలంతా అవెనుక వల్లెవేస్తారు. కొన్ని క్లాసుల్లో పిల్లలు ప్రశ్నలడగడం అందుపై చర్చలు జరగడం కూడా ఉంది.

బోధనాంశం:

ఈ స్కూల్లో వేసవిలోను చలికాలంలోను పనిగంటలు వేర్వేరుగా ఉంటాయి. వేసవికాలంలో ఉదయం 7-0 నుంచి 11 గం.ల వరకు, మధ్యాహ్నం 2-30 నుంచి 4 గం.ల వరకు క్లాసులు జరుగుతాయి. చలికాలంలో ఉదయం 8 గం. నుంచి 3-30 వరకూ క్లాసులుంటాయి. మధ్యలో 11-30 నుంచి 1-30 వరకూ భోజన విరామం. ప్రతి పీరియడు నలభై నిమిషాలు. ప్రతి రెండు పీరీళ్ళమధ్య పదినిమిషాలు విరామం. సంవత్సరం మొత్తంమీద పిల్లలు ఎనిమిదిన్నర నెలలు క్లాస్‌రూంలో పాఠాలు చదువుతారు. ఒకటి ఒకటిన్నర నెలలు ఫ్యాక్టరీల్లోగాని, వ్యవసాయ క్షేత్రాల్లోగాని ఉత్పాదక శ్రమ చేస్తారు. మిగిలిన రెండు నెలలు సెలవులు.

ఈ స్కూల్లో ప్రైమరీస్కూలు కాలం ఆరునుంచి ఐదు సంవత్సరాలకు తగ్గించేరు. ఈ ప్రయోగం ఇటీవలే ప్రారంభించడంవల్ల పెద్దతరగతుల్లో పాతపద్ధతిలో ఆరు సంవత్సరాలకు కోర్సు ప్రారంభించిన పిల్లలున్నారు. ఈ సమస్య పరిష్కరించడానికి, ప్రస్తుతం ఈ స్కూల్లో చిన్నతరగతులు మూడూ కొత్తసిలబస్(5 ఏళ్లు)ప్రకారంగాను, పెద్దతరగతులు మూడూ పాతసిలబస్(6 ఏళ్లు)ప్రకారంగానూ నడుపుతున్నారు.

సాంస్కృతిక విప్లవం తరవాత పాఠ్యపుస్తకాలు కూడా మారుస్తున్నారు. స్థానిక పరిస్థితులకు సంబంధం వుండేలాగ ఏ జిల్లాకి ఆ జిల్లాలో వేరుగా పాఠ్యపుస్తకాలు రాస్తున్నారు. ఉదాహరణకి నాన్‌కింగ్‌లో పిల్లలందరూ నాన్‌కింగ్ యాంగ్సీ నది మీద వంతెనగురించి తప్పక చదువుతారు. ప్రతి క్లాసుకి రెండు పాఠ్యపుస్తకాలుంటాయి. ఒక్కొక్క సెమిస్టర్‌లో ఒక్కొక్కటి చొప్పున చదువుతారు. ఈ పుస్తకాలు కొత్తగా

రాసినవే అయినా వాటికింకా తుదిరూపంరాలేదు. ఒక సంవత్సరంపాటు చదివేక పిల్లలు వాటిని విమర్శిస్తారు. అప్పుడు వాటిని సరిదిద్ది తిరిగి రాస్తారు

ఈ ప్రైమరీ స్కూల్లో పిల్లలు ఏం నేర్చుకుంటారు. చిన్న పిల్లలకి అయిదు ప్రాథమిక కోర్సులుంటాయి; రాజకీయాలు, చైనా భాష, భౌతిక సంస్కృతి గణితం, విప్లవకళా సంస్కృతి. అయిదవ తరగతిలో వీనితోపాటు ఇంగ్లీషు, 'సామాన్యవిజ్ఞానం' కూడా చదువుతారు. సామాన్య విజ్ఞానంలో చదివే అంశాలు సంవత్సరంలో మారుతూ వుంటాయి. మొత్తంమీద దీంట్లో మెకానిక్స్, వ్యవసాయవిషయాలు, ప్రకృతిశాస్త్రం వుంటాయి. ఈ క్లాసులో నేర్చుకున్న సిద్ధాంతాల్ని పద్ధతుల్నీ స్కూలు వర్క్‌షాపుల్లోను తోటల్లోను ఆచరణలో పెడతారు.

విద్యార్థుల్లో సరియైన రాజకీయ మానసిక దృక్పథాన్ని కలిగించడానికి కావలసిన సిద్ధాంత విద్య స్కూల్లో మొదటిస్థానం. పాతసమాజపు జీవితాన్ని చిత్రీకరించేరచనల సంపుటి "రెంట్ కలెక్షన్ కోర్టుయర్డ్"ఆనే పుస్తకం ఆరోక్లాసు పిల్లలు చదువుతూండడం మాకాశ్చర్యం కలిగించింది. ఇది సాంస్కృతిక విప్లవకాలంలో రాసిన కొత్త పుస్తకం. నాలుగోతరగతి రాజకీయశాస్త్రం క్లాసులో, టీచరు పిల్లలతో సామ్రాజ్యవాదం గురించి చర్చిస్తూంది. అమెరికన్ సామ్రాజ్యవాదం ఆసియా ప్రపంచ ప్రజల ప్రధాన శత్రువు అన్నది ఆరోజుపాఠం. ఆవిడ కొరియా యుద్ధం గురించి ఆగ్నేయాసియాలో ఇరవై సంవత్సరాలుగా సాగుతూన్న అమెరికా దురాక్రమణ గురించీ వివరించింది. ఆసియా ప్రజలు అమెరికన్ సామ్రాజ్యవాదంపై విజయం సాధించి తీరుతారనీ, అందుకు వారు సమర్థులనీ ఆవిడ నొక్కిచెబుతూంది.

స్కూలు టైం తరవాతకూడా చాలా మంది పిల్లలు 'మావో ఆలోచనవిధానం' క్లాసులకు వెళ్తారు. వీళ్లు స్కూలు ఆవరణలోనే జరిగే క్లాసులకిగాని, వాళ్ళవాళ్ళ యిళ్ల చుట్టుపట్ల జరిగే క్లాసులకిగాని వెళ్ళవచ్చు. స్కూలుఆవరణలోజరిగే క్లాసుల్లో విద్యార్థులే వుంటారు. ఇవి రెండు రకాలు : క్రమబద్ధంగా వరుసగా చర్చలు జరిపేవి కొన్ని, ముఖ్యమైన ప్రభుత్వ విధాన ప్రకటనలు వెలువడినప్పుడు, ప్రధాన సంఘటనలు జరిగి నప్పుడు వాటినిగూర్చి చర్చించేవి మరికొన్ని. నివాసప్రాంతాల్లో నిర్వహింపబడేక్లాసులు వేరొకవిధంగా వుంటాయి. స్కూలు టీచర్లు, ఆయావీధుల్లోని నాయకులు, తల్లిదం డ్రులు ప్రతినిధులుగా ఇవి ఏర్పాటవుతాయి. ఈ కమిటీలు పాఠశాల నిర్వహణ గురించికూడా అభిప్రాయాలు ప్రకటించవచ్చు.

సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడంకూడా సిద్ధాంత విద్యలో కీలకభాగం. మిడిల్ స్కూలు, హైస్కూళ్ళలోవలెనే ప్రైమరీ విద్యార్థులుకూడా తాము క్లాసురూంలో నేర్చుకున్న విజ్ఞానాన్ని ఉత్పత్తికి ఉపయోగపడే శారీరకశ్రమలో వినియోగిస్తారు.

పిల్లల పనిపాట్లు :

ఒక వర్క్‌షాపులో పన్నెండుగురు నాలుగోక్లాసు పిల్లలకి ఆకురాయి ఉపయోగించడం నేర్పుతూంది ఒకావిడ. బస్సు మెట్లు తయారుచేయడానికి లోహపు రేకును కత్తిరిస్తున్నారు వాళ్లు. "ఒకో మెట్టు తయారవడానికెంత సేపు పడుతుందని"వి అడిగేం. "రెండు పీరీళ్లకాని అంతకన్న తక్కువేగాని పడుతుంద"ని నీలంతెలుపుచారల టీషర్ట్ వేసుకున్న పిల్లవాడొకడు. అగదిలో సగం సగం తయారైన బస్సుమెట్లు అనేకస్థితుల్లో పడివున్నాయి. కావలసిన కొలతలు తీసుకొని రేకుమీద అవసరమైన డిజైను గీయడం నేర్చుకుంటూంది ఒక చిన్నపాప. ఆ పాప రెండుజడలూ అడ్డురాకుండా వెనక్కికట్టేసి దీక్షగా పనిచేస్తూంది. ఆకురాయిలో హెచ్చుతగ్గులు లేకుండా సమంగా రేకులు కత్తిరించడం ప్రాక్టీసు చేస్తున్నాడింకొక పిల్లాడు. ప్రతి పిల్లాడు బస్సుమెట్లు తయారీలో ఆదినుంచి అంతంవరకూ ప్రతి చిన్నపనీ తప్పక చేస్తాడు. "అయితే ఏ పిల్లడయినా టీచరు చెప్పిన పద్ధతిలోకాక వేరేమాదిరిగా స్వయంగా చేయదల్చుకుంటేనో"అని మా అనుమానం వెలిబుచ్చాం. "తప్పకుండా అలాగే చేయనిస్తాం. వాళ్ళ ప్రయోగానికి కొత్తరేకు పాడుచేయనవసరంలేకుండా, కత్తిరింపు మిగులు ముక్కలతో చేసుకోవచ్చు" అంటూ టీచరు గుట్టలాపడివున్న రేకుముక్కలు చూపింది; "అయినా సాధారణంగా టీచరుకుండే అనుభవందృష్ట్యా పిల్లలు టీచరుచెప్పే పద్ధతుల్నే అనుసరిస్తారు" అంటూ వాళ్ళ అనుభవాన్ని వివరించింది.

మాగైడు, పద్దెనిమిదేళ్ళ ఒక టీచర్‌తో మరో వర్క్‌షాప్‌కి వెళ్లేం. అక్కడ ఇంకొంచెం పెద్దపిల్లలు ఉన్నారు. వాళ్లు అయిల్ వడపోసే యంత్రపు లోహభాగాల్ని ఎలక్ట్రోప్లేటింగ్ చేస్తున్నారు. నీలంపేంట్లు వేసుకున్న ఆడపిల్లలు పొడుగాటి తెల్ల ఎవరాణాలు కట్టుకు పనిచేస్తున్నారు. విద్యుచ్ఛక్తి, రసాయన ద్రవ్యాలు ఉపయోగించేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలను వివరించేపటం గోడమీద వేలాడదీసేరు. దాన్ని పిల్లలే తయారుచేసేరుట. అక్కడ సామాగ్రికూడా వాళ్ల కార్మిక-టీచరు సహాయంతో పిల్లలే తయారుచేసుకున్నారని- రెడ్‌గార్డ్‌పట్టీని జబ్బకుకట్టుకున్న ఒక చిన్నఅమ్మాయి చెప్పింది. రసాయనద్రవ్యాలు నిలవవున్న ఒక పెద్ద తొట్టెను చూపించి, లోగడ దాన్ని కూరగాయలు పెట్టుకునేందుకుపయోగించేవారని ఆ అమ్మాయిచెప్పింది, ఆ వర్క్

షాపులో మిగతా సామగ్రి తయారుచేయడానికి ఆ చుట్టుపక్కల ఫ్యాక్టరీల్లో పారేసిన తుక్కు కూడా ఉపయోగించారట. వస్తునాణ్యత మొదలయిన ముఖ్యమైన పారిశ్రామిక అంశాల ప్రాధాన్యతనుకూడా ఈ వర్క్‌షాపు విద్యార్థులు గుర్తిస్తారు. వీరు తయారు చేసిన ప్రతి యంత్రభాగాన్నీ వారి ప్రయోగశాలలో పరీక్షిస్తారు. ఇక్కడ తయారైన భాగాలే ఆతరవాతి వర్క్‌షాప్‌లో ఉపయోగిస్తున్నారు.

ఇంకో వర్క్‌షాపులో ఇద్దరు ఆరోతరగతిపిల్లలు పంచింగ్ మెషీన్‌తో పనిచేస్తున్నారు. లోహపురేకులనుంచి, ఆయిల్ ఫిల్టర్‌లకు కావలసిన భాగాలు కత్తిరిస్తున్నారు వాళ్లు ప్రతి రేకునీ ఒకటికి రెండుసార్లు అన్నివైపులా చూస్తూ. వీలయినన్ని ఎక్కువ ముక్కలు వచ్చేలాగా ఏమాత్రం వృధాకాకుండావుండేలాగా వాళ్లు శ్రద్ధవహిస్తున్నారు. అదేగదిలో ఇంకోపక్క కొందరు పిల్లలు ముందటి వర్క్‌షాపులో తయారైన ఎలక్ట్రో ప్లేటెడ్ భాగాలను ఉపయోగిస్తూ, ఆయిల్ ఫిల్టర్లను సమకూరుస్తున్నారు. ఆభాగాలన్నీ ఆబడిలో తయారైనవే. ఇప్పుడిక ఆ ఫిల్టర్లను వేరే ఫ్యాక్టరీకి తరలించి వడపోత యంత్రం నెలకొల్పుతారు. చిన్నక్లాసుల పిల్లలు, టీచర్లు ప్రతిటర్ములోను ఒక వారం చొప్పున పెద్దక్లాసుల పిల్లలు సంవత్సరంలో ఒక నెలపాటు ఈ ఫ్యాక్టరీలో పనిచేస్తారు.

ఇదంతా ఎందుకు? పిల్లలకూడ పనిచేస్తేనేగానిగడవదా? చైనాఅంత బీదదేశమా? ఇదే ఒక టీచర్ని అడిగేం. "లాభాలు ఆర్జించడానికీ, ఉత్పత్తి పెంచడానికీ" కాదు అంటూ ఆవిడ వివరించింది. జీవితంలో ఉపయోగించే ప్రతివస్తువు కార్మికులశ్రమతో తయారైందేనని విద్యార్థులు తెలుసుకోవాలి. విద్యావిధానం, విద్యావంతుల్ని ప్రజల నుంచి దూరంచేసి తామొక ప్రత్యేకవర్గమని భావించుకునేలా చేయకూడదు. కలిసి కట్టుగా పనిచేస్తూ ప్రజలందరికీ సేవచేయగల సమాజం నిర్మించడమే విద్యావిధాన లక్ష్యంకావాలి. క్లాసులో నేర్చుకున్న విషయాల్ని వర్క్‌షాపులో ప్రయోగించడం ద్వారా విద్యార్థులకి విషయాలు క్షుణ్ణంగా అర్థమవుతాయని మిగతాటీచర్లు వక్కాణించేరు. అంతే కాక ఈ పద్ధతివల్ల విద్యార్థుల సృజనాత్మకశక్తి, సమస్యల్ని పరిష్కరించే సామర్థ్యం పెరుగుతాయని పెకింగ్‌లో 31 నెంబరు మిడిల్‌స్కూల్ చూసినప్పుడు మాకర్థమైంది.

చైనా పిల్లల్ని బాధ్యతాయుతమైన పౌరులుగా తీర్చిదిద్దడానికి వారికి వ్యావసాయిక పనుల్లోకూడా శిక్షణ యివ్వాలి. ప్రతి స్కూల్లోను ఒక తోట వుంది, నాన్‌కింగ్ బయటి ప్రాంతాలనుంచి రైతుల్ని ఈ స్కూళ్ళలో టీచర్లుగా ఆహ్వానించారు. ఆ విధంగా వ్యవసాయకశిక్షణ యివ్వడానికి ముసలిరైతులు విద్యావిధానంలో భాగస్వాములయారు.

"సాంస్కృతిక విప్లవానికి పూర్వం, బంగాళాదుంపలు చెట్లమీద కాస్తాయని పిల్లలు అనుకునేవారు: ఇప్పుడు అనుభవంలో నిజం తెలుసుకున్నారు" అని ఒక స్కూలు డిప్యూటీ డైరెక్టరు చెప్పారు.

నిరక్షరాస్యులైన రైతు టీచర్లపట్ల నగరవాసానికి అలవాటుపడ్డ నాన్‌కింగ్ విద్యార్థులు ఎలా ప్రవర్తించేవారు? మొదట్లో తూష్ణీభావం చూపేవారు. "టొమాటో" అనుభవం తరవాత ఈ రైతులు చెప్పేదాన్ని పిల్లలు నమ్మడం ప్రారంభించారని మాగైడు చెప్పేరు. పిల్లలు వాళ్ళస్కూలు తోటలో టొమాటోనారు పాతేరు. చెట్లు ఏపుగా ఎదుగుతూంటే వాళ్లు ముచ్చటపడ్డారు. కాని అవి సరిగా పెరగాలంటే విడివిడిగా దూరంగా పాతాలని రైతుటీచరు చెప్పేరు. కాని పిల్లలంతా కలిసి చర్చించి మొక్కలు ఎంత దట్టంగావుంటే అంతబాగా పెరుగుతాయనీ అంతబాగా కాస్తాయనీ నిశ్చయించేరు. సరే అలాగే కానిమ్మని రైతు వూరుకున్నాడు. నాలుగువారాలయేసరికీ, టొమాటో మొక్కలు, కిక్కిరిసిపోయి వున్నందువల్ల, కుళ్ళిపోయి పాడయిపోయాయి. ఈ అనుభవంతో రైతుటీచర్లు తెలివైనవాళ్ళనీ మంచివాళ్ళనీ పిల్లలు గ్రహించేరు.

(ఇంకావున్నది)

విశాల ప్రజాసముదాయం కోసం విప్లవ సంస్కృతి అనేది చాల శక్తివంతమైన విప్లవ ఆయుధం. విప్లవంకన్న ముందు సైద్ధాంతికంగా అది వాతావరణాన్ని కల్పిస్తుంది. విప్లవకాలంలో, విస్తృత విప్లవ రంగంలో అవసరమైన, ప్రముఖమైన పోరాటరంగం సాంస్కృతిక రంగం.

సమీక్ష :

# ‘నేను నేను కాదు’

గెరిల్లా (విప్లవ గీతాలు)

భూమికోసం భుక్తికోసం తెలంగాణా రైతాంగం ముప్పైయేళ్ళకిత్రం నైజామునీ ఛోటానైజాములనీ ఎదిరించి మూడునాలుగేళ్లకాలం పోరాటంచేశారు. ‘సంఘం’ఇప్పుడు నామమాత్రావశిష్టంకూడా కాలేదు. ఆ సంప్రదాయాన్ని ‘కమ్యూనిస్టు’పార్టీలు ఆచరణలో సిద్ధాంతంలోకూడా, విడనాడడమేగాక తెగనాడుతూ ఉన్నాయికూడా. అలాంటిస్థితిలో, దుస్థితిలో, మళ్ళీ దళాలు దళాలుగా కమ్యూనిస్టు యువకులు కొండలకూ కోనలకూ తరలివెళ్ళి, “పొత్తిళ్ళలోని ప్రజాసైన్య”మై, గెరిల్లాలుగా జీవిస్తున్నారు. మరణిస్తున్నారు, మరణించీ జీవిస్తారు

అజ్ఞాతకవులు రాసిన యీ గీతాలలో సంపాదకులైన వరవరరావుగారికి “ఏకసూత్రిత” కనిపించింది. శివసాగర్, పార్వతి, గంగాధర్, నటరాజమూర్తి అంతా శివ సంబంధమే. ప్రళయంకరుడైన శివుడు శుభంకరుడుకూడా. దక్షుడు తలపెట్టిన యజ్ఞాన్ని వీరభద్రుడు ధ్వంసంచేస్తున్నాడు. ఇందరు కవులు శివసంబంధీకులుకావడం గమనింపదగింది. చార్వాక, రెంజిమ్, అజాద్‌లుకూడా ఉన్నారనుకోండి. ఉన్నా ఈ యావన్మంది కవులనూ కలిపికట్టేబంధం ప్రజాసంబంధం, సాయుధపోరాటసంబంధం-సాయుధ ప్రజాపోరాటసంబంధం! పేరున్నకవులు రాసినవికావని యీ గీతాలను పరిచయంచేస్తూ వరవరరావుగారన్నారుగాని పేరున్నకవుల తలదన్నేట్లు రాసినవని మాత్రం నేననగలను. రాజకీయ కార్యకర్తలు కవిత్వంరాయరని, రాసినా అది కవిత్వం అయి ఉండదని, కొందరు అనుకుంటూ ఉంటారు, పాపం! సుబ్బారావు పాణిగ్రాహి, వెంపటాపు సత్యం. ఉద్యమాలలో పోరాటాలలోఉండి కవిగట్టినవాళ్ళే. అయితే ఈ‘గెరిల్లా’ గీతాలకూ పైవాటికీ చాలా తేడాఉంది. ‘గెరిల్లా’ కవులందరూ ప్రజాకవిత్వాన్ని ఈసడించేవాళ్లుకూడా కవులుగా గుర్తించదగినకవులు. వాళ్లు కవిగట్టలేదనిపిస్తుంది, కవిత్వం చెప్పలేదు, రాశారనిపిస్తుంది ఒకటి రెండుపాటల్లోతప్ప, వాళ్ళ కావ్యభాష జీవద్భాష కాలేదు. ప్రజాకవుల కావ్యాలలో కనిపించే భాషా‘దోషాలు’ యిక్కడ కనిపించవు. బందూక్ చేతబట్టిన విద్యాధికులైన యువకులురాసేట్టుగానే ‘గెరిల్లా’ కవులంతా రాశారు.

"పేరున్నకవులు"రాసేట్టుగానే రాశారు. అంచేతనే సుబ్బారావు పాణిగ్రాహి కవేకాదనే వాళ్లకూడా ఈ కవులను కవులుగా అంగీకరించితీరుతారు.

తమ రచనలగురించి యీ కవులకున్న శ్రద్ధను గమనించడానికి, అచ్చుతప్పులంటూ 'సృజన'లో పేర్కొనబడిన సవరణలేచాలు. "ప్రపంచ కార్మికులంతా"కు బదులు "ప్రపంచ శ్రామికులంతా"అనే సవరణ అర్థవంతమైనది. కష్టపడి పనిచేసేవాళ్ళంతా శ్రామికులైతే, కర్మాగారాలలో పనిచేసేవాళ్లే కార్మికులనిపించుకుంటారని రచయిత అభిప్రాయం కావచ్చు. ఇది సరైందీ కాందీ వేరే విషయం. "నీస్వప్నం సిద్ధించును"అనేదానిబదులు "నీ స్వప్నం ఫలియించును"అనే సవరణ, సందర్భోచితమైన పదంగురించి కవికిగల శ్రద్ధను చూపుతుంది. ఆశయం సిద్ధిస్తుంది, స్వప్నం ఫలిస్తుంది కదా! ఈ శ్రద్ధ ఒకోసందర్భంలో మితిమీరిందికూడా. "భరతభూమి కనులుతెరిచి"అనే చరణంలో "తెరిచి"కి బదులు "తెరచి"ని ఎందుకు తెచ్చిపెట్టవలసి వచ్చింది? వ్యావహారిక పదప్రయోగంవల్ల న్యూనత వస్తుందా? అతిశ్రద్ధవల్లకూడా చాలా ప్రమాదం. ఒప్పులుకూడా తప్పులనిపించేట్టే తప్పులూ ఒప్పులనిపిస్తాయి. ఉదాహరణకు అతిశ్రద్ధవల్లనే "ఇప్ప"పూలు "విప్ప"పూలయ్యాయి(మాతృఘోష). అశ్రద్ధా పనికిరాదు. అతిశ్రద్ధా పనికిరాదు కవికి. కవిఅయినవాడు ఇతరులకంటె ఎక్కువగా మాటల గురించి మెలకువగా ఉంటాడు. మాటల్లో దేని అర్థచ్ఛాయ దానికి ఉంటుంది. దేనికది విశిష్టమైనది. ఉదాహరణకు, "లాంగ్‌మార్చ్"లో "శత్రుమూక లెదురురాని"అనే చరణం చూడండి. "శత్రుమూక"దుష్టసమాసం కాదనుకున్నా, "ఎదురురాని"దీర్ఘాంతంకానక్కర్లేదనుకున్నా, 'ఎదురు రావడం'అంటే 'ఎదురుకావడం'అనే అర్థం రాదు. 'ఎదురవడం'అన్నా, 'ఎదురుపడడం'అన్నా మరొక అర్థం వస్తుంది. చార్వాక ఇక్కడమరింత మెలకువగా ఉండాల్సింది. పైగా ఇది అనువాద రచన!

లోపాలను వెదికిపట్టడంగాక, 'ప్రజా'కవులనిపించుకునే వాళ్ళలాగాక, శబ్దాల గుణదోషాలగురించి స్పృహగల కవులుగా ఈ 'గెరిల్లా'కవులను పరిగణించవచ్చునని చెప్పడమే నా ఉద్దేశం

ఇది పొగడ్తా లేక తెగడ్తా?

ఏదీకాదు. ఉన్నవిషయమే అంత. వెనకటికి 'సృజన'లో ఒకరు alienation గురించిరాస్తూ, వచనకవిత్వం ఈ alienation కు తార్కాణంగా చూపారు, ప్రజలతో మానసికంగా మమేకం కాలేక ప్రజలకు దూరంగా ఉన్న కవి జానపదగేయచ్ఛందస్సులను వాడుకచేసుకోలేక ఒకవైపూ, మరోవైపు భూస్వామ్యయుగ సాహిత్యప్రమాణాల

ప్రకారం వృత్తాలలో జాతులలో తన భావోద్రేక ద్రవాన్ని పోయలేక, శిథిలచ్ఛందోగతులతో వచనకవిత్వాన్ని ఆశ్రయిస్తాడని సిద్ధాంతం చెయ్యబడింది. విప్లవకవులకు ఈ చీటీ అంటించబడింది. ఇది ఆలోచించదగిన విషయమని అప్పుడే అనుకున్నాను. ఆ సిద్ధాంతాన్ని మరింత పొడిగించాలి. కావ్య నిర్మాణపద్ధతులకే దాన్ని పరిమితం చెయ్యకూడదు. కావ్యభాషకుగూడా అనువర్తింపజెయ్యాలి. అలాచేసి చూసినప్పుడు, ఒకటి రెండు రచనల్లో తప్ప ఈ 'గెరిల్లా'కవులుకూడా విప్లవకవులసరసనే ఉన్నారనిపిస్తుంది. కాకుంటే వాళ్లు ప్రజాపోరాటమగ్నులు, వీళ్లు అక్షరపోరాటమగ్నులు. రచనలుచెయ్యకపోయినా, వాళ్లు ప్రజాయోధులుగా గొప్పవాళ్లు, తమ పోరాటానికి అండగా రచనలు చేసి మరీ వన్నెతెచ్చుకున్నారు.

'గెరిల్లా'కవుల రచనలు పైపైనచూసినా మావోకవిత్వం గుర్తువస్తుంది. రాజకీయ జీవితం ప్రారంభించాక, మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, తమ కవిత్వవ్యాసంగాన్ని వదులుకున్నారు. మావో అలాక్కాదు. తన దీర్ఘకాలిక సాయుధ ప్రజాపోరాటం పొడవునా మైలురాళ్లుగా మావో కావ్యాలు రచిస్తూ వస్తున్నాడు. అవి వట్టి చారిత్రిక పత్రాలుకావు, నిస్తులమైన రచనలని చైనా వ్యతిరేకోన్మాదులైన మన భారతీయ దుర్విమర్శకుల తప్ప తక్కినవారంతా గమనించారు. సోవియట్ విమర్శకులుకూడా కాదనలేదు. కాకుంటే సిద్ధాంత వివాదానికి హంగుగా వాళ్లు వ్యక్తివిమర్శకు పూనుకున్నారు. మావో కవిత్వం, ప్చ్ ప్చ్! 'రివల్యూషనరీ రొమాంటిసిజం' పొమ్మన్నారు— ఇదేదో పంచమహాపాతకాల్లో ఒకటైనట్టు! నిజానికి కాల్పనికత, వాస్తవికత పరస్పర బాహ్యమైనవి కావలసినపనిలేదు. ముఖ్యంగా విప్లవసాధన సుదూరాన ఉన్నప్పుడు కాల్పనిక భావావేశం కవులకు తప్పనిసరిగా అవసరమౌతుంది. ఈ 'గెరిల్లా'కవులంతా ఆ భావావేశ పరవశులే. చారిత్రక ఆశావాదం యీ రచనలబలం. మట్టిపురుగులుగా మురికి పదార్థాన్ని వీపునమోస్తూ అంగుళం అంగుళం ముందుకుసాగుతూ ఉండగోరక ఒక్కపెట్టున రెక్కలు విదిలించుకుని ఉప్పరాని కెగసిపోయే పక్షుల్లాగా ఈ కవులు నేటి దుస్థితిని తలచుకుని కుమిలి కుంగిపోకుండా భవిష్యత్తునుచూసి వస్తున్నారు, చూపిస్తున్నారు. శత్రువు విసిరిన బండరాయి పూలచెండే. 'రివల్యూషనరీ రొమాంటిసిజం' విప్లవ కవులందరికీ ఇప్పటిదశలో అనుసరింపదగిన మార్గమే.

ఇన్ని గీతాల్లో ఏది అత్యుత్తమంగా ఉన్నది అని అడిగితే దేనికి అదే అయినా, 'నాచెల్లీ! చెంద్రమ్మా!'కు నా ఓటువేస్తాను. జానపదగీతాల ప్రాణవాయువుల్ని ఇది సొంతపరచుకుంది. వెనకటి తెలంగాణా సాయుధ పోరాటంలో పోలీసులబారినుంచి

తప్పించుకొనేందుకు పాడుబడిన నూతిని శరణుజొచ్చిన చుక్కమ్మకుగూడా బుద్ధిచెప్పేలా తన భర్తనుచంపిన కాసిరెడ్డిని తాను చంపి అడవుల్లోని అన్నలవద్దకు వెళ్ళిపోయిన రేపల్లె చెందమ్మ వ్యవహరించింది. వర్గ శత్రునిర్మూలన గురించి తనకెవ్వరూ నూరి పొయ్యలేదు. తమంతతాముగా ప్రజలు అనాదినుంచీ ఆపనిచేస్తూనే ఉన్నారు. అయితే ఇలాంటి చర్యలు Spontaneous మాత్రమే. వీటికి సిద్ధాంతబలం సమకూరినప్పుడు, జనంనుంచే సైన్యం సమకూరుతుంది. దాని సూచనే చెందమ్మ అరణ్యప్రస్థానం. ఈ గేయంద్వారా రెంజిమ్ కవిగా తన alienation ను వదులుకున్నాడు. లేకుంటే ఇంత ఉద్రేకాతిశయం, అందుకుతగిన జనం పలుకుబడి ఈ రెండింటినీ యిముడ్చుకోగలిగిన గేయరూపం సాధ్యమయ్యేవికావు. "ఉసిరిగనీడల్లో పసిరిగపామై", "అంకారి బింకారి ఇంకారితేలై" కాసిరెడ్డి "చుక్కపొద్దువేళ చుక్కల్లో" కలిసిపోయిన మొగిలి, జారు కొప్పుతో జాగిరినడుముతో అదిల అవిపిస్తూకూడా, రాకాసిరెడ్డి కొవ్వుబలిసిన మెడ మీద-కాదు-కుత్తుకమీద, పొత్తిపొట్టలో ఒకసారి, ఇంకోసారి, మూడోసారి, సాగుగో సారికూడా తన కసినంతా ఒత్తి ఒత్తి-"కత్తి ఎత్తి వొత్తి పొత్తికడుపులో"కత్తితోహత్తిన చెందమ్మ- ఇవన్నీ అలంకారాలక్కర్లేని సహజపాత్రలు. వీటితో ఒక గేయరూప కమే పరిదర్శించవచ్చు. పుత్తడిబొమ్మ పూర్ణమ్మకు తీసిపోని రచన యిది. పూర్ణమ్మ అశక్తురాలు- దుర్గలో సాయుజ్యం పొందింది చెందమ్మ అసాధ్యురాలు- అడవిలో అన్నలవద్ద సాఫల్యం పొందింది.

ఛళ్ళు ఛళ్ళుమని తెల్లవారింది
ఎందుకో ఆపొద్దూ పల్లె నవ్వింది
గాలి వీచింది, గరిక పూచింది
కోడెదూడ మెడలో గంట మోగింది
సారె తిరిగింది, కదురు కదిలింది
రావిచెట్టుకింద కొలిమి మండింది,
ఏటి పాట కొండసిగను చేరింది
అడవిలో అన్నల్ల చెల్లి చేరింది."

దేనికది విడిచిత్రం- అన్నీ కలిస్తే పల్లెపట్టులోని రాకాసిరాజ్యాన్నిచూసే సమగ్ర చిత్రణం, ఈ గేయం మొత్తం సంకలనానికేగాక ఇటీవలి తెలుగుకవిత్వానికంతటికీ గర్వించ దగిన అలంకారం.

'గెరిల్లా'కవులు పట్టికవులుకాదు, "విప్లవ కవులు"మాత్రమేకాదు, గెరిల్లాలైన

కవులు. గొరిల్లాకవులే తెలుగులో వేనవేలు, అందులో విప్లవ కవులు పదులు, వారిలోనూ గెరిల్లాకవులు "కవిష్టికాధిష్టితులు", పోనీ వేళ్ళమీద లెక్కించదగినంత కొద్ది మంది. ఈ విషయాన్ని ఇందులోని ఖండికలే నిరూపిస్తాయి. "పేరున్న కవులు"రాయనేలేనివిధంగా రాసిన ఖండికల్లో 'ఉద్యమం నెలబాలుడు', 'ఉరిపాట', 'జేగంటలు' పేర్కొనదగ్గవి. ఉత్తమ కవిత్వం వీటిలో ఉన్నదనికాదు, వీటి వైఖరి గెరిల్లాలుకాని కవులకు— విప్లవకవులకుగూడా అసాధ్యమని చెప్పడానికే ఈమాట అంటున్నాను.

ఈ చరణం చూడండి:

"రండోయ్! రండోయ్!
ప్రజావిముక్తి సమరంలో
చేరగ వేగమె రండోయ్!
రండోయ్! రండోయ్!"

"రండి!"అంటున్నవాడు తాను ఎక్కడఉన్నట్టు? తాను ఆ సమరంలోఉండి, ఇతరులను తనవైపుకి రమ్మంటున్నాడుగాని తాను బయటఉండి ఇతరులను అటు పొమ్మనడం లేదు. అదే విశేషం. అంతేకాదు. పరకాయ ప్రవేశం చేసినవాడిలాగా తాను భిన్నావస్థలను తనకే ఆపాదించుకుంటున్నాడు— ఒకసారి బందూక్‌ధారిగా, ఇంకొకసారి ఉరిశిక్ష అనుభవిస్తున్నవాడిగా, మరోసారి అలలతో తాదాత్మ్యం పొందుతున్నట్టుగా, మరింకోసారి వీరుల కాళ్ళియమిచ్చి ధైర్యం చనుబాలుచేసి గాయాలుమాన్పే మాతృమూర్తిగా. ఈ సంకలనంలోని కవులు అనేకులైకూడా వారందరిలో ఒకే ఒక గుండె ఉన్నట్టుగానే, ఒకేవ్యక్తి అనేక విధాలుగా అనుభూతి పొందుతూ బహురూపి అవుతున్నాడు. "నేను నేనుకాదు"—

నేను గిరిజనుడు సారించిన విల్లును
నేను రైతు కసితో విసిరిన గండ్రిగొడ్డలిని
కలకత్తా వడివీధిలో విగ్రహమహాత్ముణ్ణి విధ్వంసంచేసిన సమ్మెటను
.... .... .... .... ....
నేను అధోలోకానికి పోతున్న
సమాజ విమానాన్ని హైజాక్‌చేసిన వాణ్ణి
ఖడ్గాన్ని మీటి ప్రచండ జనసంగీతాన్ని సృష్టించినవాణ్ణి
దరిద్రింలో పచేలస్నానంచేసి
చరిత్ర చెక్కిలి ముద్దాడినవాణ్ణి

నేను పొత్తిళ్ళలోని పరిజాసైన్యాన్ని
నేను నక్సల్‌బరీని ; నేను ముషాహరీని ;
నేను శ్రీకాకుళాన్ని ;
రెనగేడ్ ; నేను విప్లవాన్ని !"

"వ్యక్తిగా పోరాటంలో మరణించినా / మహత్తరశక్తిగా ఉద్యమంలో సదా జీవిస్తాను"- మూర్తీభవించిన విప్లవ సత్యం ఇదే.

— రమణారెడ్డి

హృదయ స్పందన :

## గెరిల్లా

మహాప్రస్థానం నన్ను కమ్యూనిస్టుని చేస్తే నన్ను కన్నీటిలోనుంచి నా కమ్యూనిజాన్ని ప్రశ్నించిన కావ్యం గెరిల్లా. ప్రజల మెనునిద్దుర వదిలించి, మహాప్రస్థానం మరోప్రపంచానికి మార్గం చూపిస్తే ఆ మార్గం అక్షరాల ఆచరించిన కావ్యం గెరిల్లా. ప్రజల "శ్రేయస్సుకే తమ కవిత్వం అంకితంచేసిన కవులు ఏ సాహిత్యంలో అయినా ఉంటారు. ప్రజలకొరకు తమ ప్రాణాలను పణంగా పెట్టగలిగిన కవులుమాత్రం విశ్వసాహిత్యంలోనే అరుదు. ఈ విషయంలో విశ్వసాహిత్యంలో ఆంధ్రసాహిత్యం తరపున ప్రాతినిధ్యం వహించే మహాకావ్యం గెరిల్లా.

ఆంధ్రసాహిత్యంలో గెరిల్లా స్థానం ఎక్కడ అన్న ప్రశ్నలేదు. ఆ మాటకు వస్తే ఆంధ్రసాహిత్యమే తన అర్హత నిరూపించుకోవలసి ఉంటుంది. గెరిల్లా ముందు, ఇవి ఆవేశంలో అన్నమాటలు కావు. నిస్సందేహంగ గెరిల్లా అంతటి స్థానం కలిగివుంది. ఈ విషయం గెరిల్లా నిరూపించుకోనూగలదు. ఇన్నేళ్ళ ఆంధ్రసాహిత్యంలో ప్రజాకవిత్వం ఏది అంటే, మొదట గెరిల్లాను చెప్పితీరాలి. ప్రజల భాష, బాధ, ఆ వేదన ఈ కవిత్వానికి తెలిసినంతగ ఇంకేకవిత్వానికి తెలియదు. ప్రజలభాషను, బాధను జీర్ణించుకున్న కవిత్వం ఇది. శ్రామికుల కన్నీటి కడలిని చూచి కరిగిపోయి ఎలుగెత్తి ఏడ్చినదీ కవిత్వం, వారి కన్నీటిని తుడిచి హృదయానికి హత్తుకుంది. కౌగిలిలో పొదువుకుంది. తన స్తన్యం పొంగుతో వాళ్ళ దాహం తీర్చింది. జోలపాడి తన ఒడిలో

మెచ్చని ఓదార్పు నిచ్చింది. ప్రేమతో వారి నుదుటిపై చల్లని ముద్దిడినది. తన బిడ్డల గుండె గాయాలను చూచి ఆ మాతృహృదయం ఘోషించింది. పలవరించింది, విల పించింది. తనలో జీవశక్తి జ్వలిస్తున్నంతవరకు, తుదివరకు శత్రువుతో పోరాడుతా నని అభయం యిచ్చింది. శ్రామికరాజ్యం కోసం గెరిల్లా పోరాటం ప్రారంభించిన కవిత్వం గెరిల్లా. అందుకు ఈ కవిత్వానికి( ఈ కవులకు)ఎంత త్యాగం అవసరమైనదో ఊహాతీతమే. అందుకే అన్నాను, ఈ మహోన్నత త్యాగమూర్తి, ముందు అంధ్రి సాహిత్యమే తన అర్హత నిరూపించుకోవలసి ఉంటుందని. కవిత్వంలోని లోతుపాతులు, శిల్పంకాదు ఈ కవిత్వానికి ముఖ్యం. అని అవి లేవనీకాదు. కవితా శిఖరాలలో మరే ఆధునిక కావ్యానికీ ఇది తీసిపోదు. మించినదే అన్నా ఆశ్చర్యం లేదు. ఈ కవిత్వం కోరుకున్నది ప్రజలను చైతన్యవంతులనుచేసి దగా, దోపిడి, మాయ, మోసం లేని మరో ప్రపంచానికి వారిని నడిపించడం. ప్రయాణం పదివేలమైళ్ళని. అడుగడుగునా నెత్తురు మడుగని, కన్నీటి కడలని వారిని హెచ్చరించడం, ఉరిదండను మెడనుదాల్చినా విప్లవ నినాదమే చేయమని, విజయగీతికే పాడమని బోధించడం అంతిమవిజయం మనదే నంటు, వెన్నుతట్టడం! ఈ కవిత్వంలోని విశేషమేమంటే ఇది చూపిన ఆచరణ।

ఈ ఆశయాలకీ తమ కలాలను ఆయుధాలుగ ధరించి పోరాడుతున్న విప్లవ వీరులు, విప్లవ కవులు. సమాజంలోని దోపిడీని బహిరంగంచేసి, ప్రజలలోని మూఢ నమ్మకాలను, బూజుపట్టిన భావాలను, అజ్ఞానాన్ని పోగొట్టి వాళ్ళలో చైతన్యం కలిగించి సాయుధులను చేయడానికి ప్రయత్నిస్తున్న కవులు వీళ్ళు. ఈ పరిధిలో వీళ్ళను శంకించడం అనవసరం. ఇందుకు ఒక్కటే ఒక నిదర్శనం. ఎన్నో నిర్బంధాలకు వీళ్లు గురికావడం, త్యాగాలకు సిద్ధపడడం. ప్రజలకొరకు పోరాడుతున్నంతవరకు విరసానికి నాశనం లేదు. ఉండదు. చెప్పడం ఏమంటే విరసం కంటె కూడ మరో అడుగు ముందుకువేసిన కవిత్వం గెరిల్లా. ఈ కవిత్వం త్యాగానికి విలువ కట్టడం, దానిస్థానం నిర్ణయించడం సాహసమే అవుతుంది. ఆ అర్హత అధికారము మనకులేవు.

ఈ కవిత్వం తీవ్రవాద కవిత్వమని, ఉగ్రవాద కవిత్వమని వంకలుపెట్టి నీరసించే నీరస కవులుకూడ వున్నారు. శ్రామికుల పట్టెడన్నం చట్టబద్ధంచేసి దోచుకునే అమానుషత్వాన్ని ప్రశ్నించడం తీవ్రవాదమే అయితే, ఇది అన్యాయం అనడం ఉగ్రవాదమే అయితే ఈ కవిత్వం తీవ్రవాద కవిత్వమే. ఉగ్రవాద కవిత్వమే. కాని ఒక్క మాట. ప్రజాకవిత్వం ముసుగులో ఉన్న వ్యవస్థనే కాపాడుతు, వేలకువేలు డబ్బు గడిస్తూన్న పురాణ కవులకు, భక్తి కవులకు, శృంగార కవులకు, సినిమా కవులకు,

అకాడమీ కవులకు, అభ్యుదయ కవులకు, అవార్డు కవులకు— గెరిల్లా పేరు స్మరించడానికి కూడ అర్హతలేదు. డబ్బుకోసం తన మేధస్సును తాకట్టుపెట్టి, కవిత్వాన్ని తార్చుకుని బతుకుతున్న వీళ్ల గెరిల్లా కవిత్వం ముందు సిగ్గుపడాలి. ప్రజాకవిత్వం అంటే ఏమిటో, ఎలా వుంటుందో, ఏ ప్రయోజనం కోరుతుందో గ్రహించి ప్రజాకవుల్లా ఆ పోజు పెట్టడం మానాలి. "ప్రజలకు అర్థమయ్యేభాషలో వ్రాయడమే" ప్రజాకవిత్వానికి అర్థంకాదని ఈ ప్రబుద్ధులు గుర్తించాలి. అయినా గెరిల్లాకవిత్వానికి తట్టుకోగల గుండెచేవ ఈ నీరసకవులకు వుంటుందని మనం మాత్రం ఎలా ఆశించగలం?

ఆంధ్రసాహిత్యంలో విప్లవ శంఖం పూరించినకావ్యం, మహాప్రస్థానం అయితే విప్లవ శంఖం పూరిస్తూ, విప్లవరంగంలోకి వురికిన కావ్యం గెరిల్లా. మహాకవి శ్రీశ్రీ అన్నట్లు "విప్లవ కవిత్వమే ఈ ప్రభుత్వానికి అచిరకాలంలో సమాధి కట్టుంది." ఇందులో సందేహంలేదు. విప్లవ శంఖం పూరించడమేకాక ప్రాణాలకుకూడ తెగించి విప్లవ కవిత్వం నేడు పోరాటరంగంలో విజృంభిస్తోందంటే, ఈ దోపిడివ్యవస్థ ఘడియలు నిస్సందేహంగ దగ్గరపడ్డట్టే. చేయవలసిందేమంటే, యీ ప్రపంచాగ్నికి మనమూ ఒక్కసమిధను ఆహూతివ్వడం. ప్రశ్నించిన గెరిల్లా కవిత్వానికి సవినయంగ నా కన్నీరు చెప్పిన సమాధానమూ ఇదే.

గెరిల్లా గొప్పతనం నిరూపించటానికి నేనీ నాలుగుమాటలు వ్రాయలేదు. సహస్రాంశమైన, నాకాశక్తి లేదు. గెరిల్లా నాలో కలిగించిన అపూర్వ సంచలనాన్ని, హృదయ స్పందనను, మహోన్నత త్యాగమూర్తి అయిన ఈ కవిత్వంపై నాకున్న ప్రగాఢ అభిమానాన్ని వ్యక్తం చేసుకోవడానికి మాత్రమే నా ఈ చిన్న ప్రయత్నం.

— జయశ్రీ

సాహిత్య లేఖలు :

# ప్రభుత్వ వ్యతిరేక పోరాటాన్ని ముందుకు తీసుకపొండి!

ఆంధ్ర దేశాన్ని కబళించిన రిజర్వు పోలీసు, సైనిక దళాల అత్యాచారాలను విప్లవ రచయితల సంఘ అధ్యక్ష, ఉపాధ్యక్షులుగా మేం ఖండిస్తున్నాం. పంచ సూత్ర పథకాన్ని రుద్దడం కోసం ఇందిరా గాంధి తన ఆయుధాగారం నుండి చివరి ఆయుధాన్ని తీసికొన్నది. ఫలితంగా ఆమె ప్రజాస్వామ్యం అస్తమిస్తున్నది. ఎప్పటి లాగే తనదారి సుగమం చేసుకోవడం కోసం ప్రజాస్వామ్య మంత్రోచ్ఛారణ చేస్తున్నది. అంతరంగిక భద్రతా చట్టం కాంగ్రేసేతర వేర్పాటువాదనాయకులను, విద్యార్థులను, కార్మికులను జైల్లో పెట్టడానికే ఎక్కువగా ఉపయోగించబడుతున్నది. కర్ఫ్యూలేని దినంలేదు. ఈ భూమిపై చీకట్లు వ్యాపించాయి. సి, ఆర్. పి. సైనిక దళాలు విద్యుచ్ఛక్తి కార్మికుల సమ్మె మూలంగా విద్యుచ్ఛక్తికి అంతరాయం ఏర్పడితే, వాళ్ళను వాళ్ల రక్షించుకోడం కోసం కర్ఫ్యూ పెడుతున్నారు. ఆంధ్రప్రాంతము అన్నిపట్టణాలలో ముందు హెచ్చరికలేకుండా బుల్లెట్లు, బాయ్‌నెట్లతో ఆందోళనకారులపై దాడులు జరుపుతున్నారు. ప్రభుత్వ యంత్రాంగం మృగ్యమైంది తెనాలి, అనంతపురం, నెల్లూరు, విజయవాడ, విశాఖపట్టణం, ఆదోని, అమరావతి, ఒంగోలు సంఘటనలు తూర్పు పాకిస్తాన్‌లో పాక్ దురాగతాలను మరిపిస్తున్నవి. ఊగిసలాడుతున్న ముఖ్యమంత్రిని (అప్పటికి-సం)అపఖ్యాతిపాలైన ప్రధానమంత్రిని నిలబెట్టటం కోసం ఆంధ్రప్రాంతం సైనిక వలసప్రాంతంగా మార్చబడింది.

సిసలైన సమైక్యత సాధించడానికి ఆంధ్రప్రదేశ్‌లోని రెండు ప్రాంతాలలో ఐక్యతాభావం ఏనాడూ బలంగాలేదు. ప్రభుత్వం విభజించిపాలించే పద్ధతిలో కావాలనే వారినలా తెలివిగా దూరంగా ఉంచింది. ఒకరిపై ఒకరు కక్ష సాధించుకోవడం కోసం ప్రాంతీయ అసమానతలు స్వార్థపరవర్గాలచే ఉపయోగించుకోబడుతున్నవి. ప్రపంచానికి యీరోజు కనిపిస్తున్నది కృత్రిమమైన పరిపాలనా ఐక్యత- ఏరకంగా మొదలైనా, దాని ప్రారంభకుల ఆశయాలేవైనా ప్రస్తుత రాష్ట్ర విభజనోద్యమం వేనవేలసంఖ్యలో పురుషులను, స్త్రీలను యువకులను తనలో కలుపుకుంటూ ప్రజాపోరాటంగా మారింది. వేర్పాటుప్రజల మూలసమస్యలకు నిజమైన పరిష్కారం కాకపోవచ్చు. కాని మేము, ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తున్న విద్యార్థులు, నిరుద్యోగులతో నిలబడతాం. అదే సమయంలో మన యువకిశోరాల హత్యల నెత్తురుటేర్లనుండి పాలకవర్గం దాని తొత్తులు రాజకీయ ఉద్దేశ్యాలను సాధించుకోవాలనే విద్రోహంనుండి జాగ్రత్త పడాలని హెచ్చరిస్తున్నాం- చూడండి. మొన్ననే దీనికి ఉదాహరణగా సమ్మెచేస్తున్న విద్యుచ్ఛక్తి కార్మికుల నాయకులనబడేవారిపై వత్తిడి తేబడగానే లొంగిపోయారు.

అందుకే 1969 లో తెలంగాణాలో దగాజరిగినట్లే మళ్ళీ యీ ప్రజాద్రోహులచే మోసపోరాదని ప్రజలను మేం హెచ్చరిస్తున్నాం— ప్రస్తుత ప్రభుత్వ వ్యతిరేక పాక్షిక పోరాటం దీర్ఘకాల ప్రజాపోరాటంలో కలిసి ఈ కథకంతకుకూడా కారణభూతమైన వ్యవస్థను కూలద్రోసేవరకూ విశ్రమించవద్దని ప్రజలకు మేం పిలుపు ఇస్తున్నాం.

విప్లవం వర్ధిల్లాలి!

విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి!!

మద్రాసు
ది. 11-1-1973

అధ్యక్షుడు: శ్రీ శ్రీ
ఉపాధ్యక్షుడు: కొడవటిగంటి కుటుంబరావు

[పైన వేర్పాటు ... ... నిలబడతాం అన్న చరణాలక్రింది గీతలు మావి. ఈ ప్రకటనసారం 15 జనవరి ఆంధ్రజ్యోతి దినపత్రికలోకూడ వచ్చింది. పై ఇద్దరూ ఇంగ్లీషులో యిచ్చిన ప్రకటన పూర్తి అనువాదమిది. సంపాదకుడు.]

ప్రస్తుతం ఆంధ్రదేశంలో ప్రత్యేక ఆంధ్ర తెలంగాణ ఆందోళనలు జరుగుచుండగా మీరుమాత్రం సృజన పత్రికలో ఏమాత్రం ఈ ఆందోళన ఏమిటి ఎటువైపు ప్రయాణం చేస్తున్నది. విప్లవ సాహిత్య పాఠకులకు తెలపకుండ వుండుట చాల విచారకరం. డిసెంబర్, జనవరి రెండు సంచికల్లో వ్రాస్తారేమో అని ఎదురు చూచి నిరాశపరులం అయ్యాం. మనకేంలే అని మిన్నకుండయుంటే తెలుగుజాతికి ద్రోహంచేసినవారం అవుతాం. ఈ సమస్యను యింకా పరిశోధించుతున్నారా "సమస్యలను అన్నివైపులనుండి, కానవస్తున్న వైపునుండి, కానరానివైపునుండి పరిశీలించడం మనం నేర్చుకోవాలి. విర్థిష్టమైన పరిస్థితులలో ఒక చెడ్డవిషయం మంచిఫలితాలివ్వవచ్చు. అలాగే ఒక మంచి విషయం చెడ్డఫలితాలకు దారితీయవచ్చు. అన్నారు కామ్రేడ్ మావో!

ఇంకా యిలాఅన్నారు- "సమస్యలన్నీ పోగుపడేదాకా వేచివుండవద్దు— అపుడు వాటిని పరిష్కరించడం చాలా కష్టమౌతుంది" కాని మీరు సమస్య పరిష్కారం అవునందాకకూడ మీ అభిప్రాయం చెప్పకుండ వుండటం చాలా విచారకరం. పాతకాలపు చరిత్రను పరిశోధించి ఈ సమస్యను సమగ్రంగా పరిశీలించి, ఫిబ్రవరి సంచికలోనైన ప్రకటిస్తారని ఆశిస్తాం.

యువజన సంఘం,
వెలిదండి.

జూన్ '72 సృజనపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నిషేధాజ్ఞ

# Government of Andhra Pradesh

ABSTRACT

*Forfeiture of books* :- Andhra Pradesh Revolutionary Writings-Monthly Magazine "Srujana" - Issue of 1972-Edited and Published by Varavara Rao for Sahithi Mithrulu and printed at Venkataramana Mudranalayam J. P. N. Road, Warangal-2 -Forfeited - Orders-Issued.

HOME (GENERAL. A) DEPARTMENT

G. O. Ms. No. 1451 Dated: the 10th Nov. 1972

Read the following:-

From the Superintendent of Police, Special Branch, CID Hyderabad Lr. S. B. No. 3043/AN 4/72 D/ 21-7-1972

ORDER:

The following notification shall be published in the Andhra Pradesh Gazette :-

NOTIFICATION

WHEREAS it appears to the Government of Andhra Pradesh that the monthly Magazine "Srujana" issue of June, 1972 edited and publishd by Varavarr Rao for Sahithi Mithrulu and printed at Venkataramana Mudranalayam, J. P. N. Road, Warangal-2 contains matter referred to in the Schedule below, which is calculated to bring in to hatred contempt and excites disaffection towards the Government established by law in India, and is prejudicial to maintenance of harmony, the publication of which is punishable under sections 124-A, 153-A and 295-A of the Indian Penal Code.

NOW THEREFORE, in exercise of the powers conferred by sub-section (1) of section 99-A of the Code of Criminal Procedure, 1898 (Central Act 5 of 1898), the Governor of Andhra Pradesh hereby declares every copy of the aforesaid monthly Magazine containing notes and poems to be forfeited to the Government of Andhra Pradesh.

# Song of Hanging

Standing on
The Gallows,
I will let loose my
Imagination.

The other world
will swing in the
cradle of my
imagination.

I will dream
sweet dreams
standing under the gallows

My sweet dreams
will become true
and the whole world
will be happy over it

The red flag
will fly
over the Himalayas
of humanity.

The great man
will rise
from the great flames
of revolution

Lilies will bloom
in Kalhari desert

I will sing
great song
standing in
front of gallows.

The Red army
will open its wings
and spread to
all corners of the country

The invincible and
sharp red army
will achieve
liberation.

It will build tombs
on the devils
and the spectres.
Standiag on
the threshold of
gallows, I view
the other world.

The time
will put down
the curtain
on this devilish world.

The crescent moon
will run the
wheel of the
machines in the
factory

The worker
with his tight fist
is the leader
of the new world
the great worker

is the supreme
soverign.

I will stand
before gallows
and sing
my songs.

The other world
will swing
in the cradle
of imagination

Oh, friends
Do not shed
tears for my sake
Do not forget
struggles
Do not lay down
red flag.

Keep the gun
in your hand safely

I will finger
the tunes of the
Universal song
placing my head,
on the gullitone.

The Universal song
will be heard
all over the
even seas.

The friendship
of sickle and hammer
will show the
path of light

The peasant
will plough his land
holding the
Sun in his palm.

My blood will
not go waste,
My death will
not go waste.

A new world
will bloom
in the pond
of my blood.

The song of life
will be heard
in the face of death.

I will raise the
slogan of revolution, and
slogan of victory;
standing infront
of the gallows.

I will sing
the song of life; the song
of new life;
standing in
face of death.

Good bye-good bye
Good bye to gallows
Good bye to the noose
Good bye to prison walls
Good bye to the hood
of cobra.

# WE ARE COMING

(*Iskra*)

Beware, we are coming;
We are coming sharpened
We are moving with vengeance
We are coming sharpened and with vangeance!

We are sickles with starving stomaches,
We are ploughs with broken back bones.
We are hammers and scikles; we are aces and Saws;
We are sweating toilers,

We are armed workers,
We haveshed off Fear;
We are coming with out fists raised;
Beware; we are coming sharpened
We are moving with vengeance.

Vengeance is full in all our blood vessels;
As a result of exploitation over generating
The poor people,
Who have strirred out of every village
We are guerillas' we are guerillas,
We are machine guns well aimed
We are the cremson in the sky in
the morning- Red Army;

We are coming, beware
We are coming sharpened and with vengeance.
Will Sriqakulam die
If satyam is murdered?
Will Naxalbary (movement) stop
If Karmarqar is shot dead?

Thousands and thousands will rise
In the hot blood of Nirmala, Chinnababu
Ganapati and Bhaspar.

"You cannot shut out the light
of the sun" by placing your hands
across your eyes;
Beware; we are coming
With vengeance and vengeance.

Birbhum is thundering loudly
It is raining fire in Bihar,
Peoples war and protracted armed struggle
are the delugue, which break the hearts
of hirling gangs.
Our death is the death of hero, it is immortal.
It is a step for liberation-it is the supreme death.

Beware, Beware,
We are coming with vengeance,
We are coming sharpened.
We are marching shoulder to shoulder with Vietnam,
We are marching in step with Combodia,
We are marching in the foot steps of Red China.

We march in step, We march with a song
We mark time, we wait for a chance
We will stop in your heart as in a lightening;
We will give a clean burial to your evils;
We are coming; beware
We are coming sharpened.
We are moving with vengeance.

## Peoples Army
*(X-Ray)*

There are forests in plenty all over the country;
They are our fortresses;
There are solid hills;
They are our forts;
There are rivers and seas;
They are our weapons;
The rain and the flood
become noose around the neck of the enemy.

Day time;

Fires are raining on the heads of the enemy;

Night;

The fears pierce sharply
and deeply into the hearts of the enemy;
Mobilise your guerilla army of nature;
Make the nature speak with guns
Hold talks with nature with hand grenades;

Look. the torch of red flag is visible;
Even people with loose joints
Are stirring; Advance.

## CONSPIRACY
*(Rudra Jwala)*

These fair price depots
Are not to improve your life of starvation
They are for watering down
Your revolutionary trend

Which has caused you to break open
their black markets, godowns and
profiteering

It is a conspiracy
to lead those
people, who are shedding their
blood for your well being,
astray from the struggle line.

These credits on low rates of interest
grant of pattas for banjar lands,
Are not to make your life happier;
It is only placing shackles on your hands;
That are reaching for the spear and the axe,
Which your people have raised
against the gangs of exploiters;
At a few places here and there;
In Srikakulam-Chittor and Nellore.

There is the selfishness of the exploiting
imperialists;
To reduce you from collectivism
to temporary individualism;
To split your unity
And then to crush you and your people one by one;
This is a conspiracy to make you a person
Bargaining for a few grains;
Begging for a few acres of banajaras;
Begging for credits of a few rupees;
While guarding with guns the bandicoots of these class
Who have robbed you of the fruits of
toil for generations and generations.

BY ORDER AND IN THE NAME OF
GOVERNOR OF ANDHRA PRADESH,
*Sd / Joint Sec. Govt.*

# ప్రస్తుతం సృజన దగ్గర అమ్మకానికి సిద్ధంగావున్న పుస్తకాలు

| | | | |
|---|---|---|---|
| 1. | తెలంగాణ పోరాట పాటలు | | రు. 1–00 |
| 2. | నాంది నాటకం | గంగిరెడ్డి | 1–00 |
| 3. | జనసేన పాటలు | జనసేన | 1–00 |
| 4. | అ. ర. సం. కాయకల్ప చికిత్స | కె. వి. రమణారెడ్డి | 1–25 |
| 5. | కవిత్వం-చైతన్యం | త్రిపురనేని మధుసూదనరావు | 1–50 |
| 6. | ఎర్రపిడికిలి | కె. వి. రమణారెడ్డి | 3–00 |
| 7. | సూరీడు | సుగంబాబు | 1–00 |
| 8. | గెరిల్లా | విప్లవ గీతాలు | 1–00 |
| 9. | నాకుటుంబం నవల | టావ్ చెంగ్ | 2–00 |
| 10, | భారతీయ తత్వశాస్త్రం-<br>ఒక పరిశీలన | నిమ్మగడ్డ<br>వెంకటేశ్వరరావు | 1–00 |
| 11. | కళ | సంపాదకుడు-చలసాని ప్రసాదరావు | 5–00 |
| 12. | మహోదయం బుర్రకథ | కానూరి వెంకటేశ్వరరావు | 1–00 |
| 13. | తూర్పుగాలి | నగ్నముని | 3–00 |
| 14. | సమరం | సంకలనకర్త-అగ్నిమిత్రి | 1–00 |
| 15. | విప్లవం వర్ధిల్లాలి | బాలాజీ పబ్లిషర్స్, తిరుపతి | 1–50 |

SRJANA Telugu Monthly Feb. '73 H-1088
Regd. No. with Registrar of News Papers 10953/67

త్వరలోరానున్న విరసం ప్రచురణ

## శ్రీకాకుళ సత్యం



ఆదిభట్ల కైలాసానికి అంకితమైన
వెంపటాపు సత్యం పాటలు

వెల 1 రు.




మీ కాపీ కోసం యిప్పుడే రాయండి

ప్రతులకు: సృజన, హనుమకొండ, వరంగల్ 506001

96 Pages 1 Re